# జీససు సందేశం

(టాల్‌స్టాయి)

Presented by
Kattamuri Subbarao

"నిన్ను నిర్మలభక్తిచే గన్నవారి
కీర్తి సంపూర్ణ చంద్రునిమూర్తి నవ్వి
వెలుగుచుండును జగములు వెలుగుదాక..."

(ఆ. సోమనాథరాయకవి)



అనువాదకుడు:
తల్లాప్రగడ ప్రకాశరాయుడు.

వెల ఆరు అణాలు

# ముందుమాటలు

—————:o:—————

1. టాల్‌స్టాయి మహాశయుడు వ్రాసిన పుస్తక మిది. బాలికలకు, బాలురకు "బైబిలు" సులభంగా బోధ పరచడానికే తా నీ చిన్నపుస్తకాన్ని వ్రాశా నన్నాడు. చిన్నపిల్లలకు కూడ సత్యమునందు, ధర్మమునందు సహజంగానే అభిరుచి వుంటుంది. పెద్దల అజ్ఞానం వల్లిబలి పిల్లలను పాడుచేయకుండా వుంటే సాంఘికనిరంకుశత్వం వాళ్ల కోమలహృదయాలను నొక్కి నాశనం చేయకపోతే, నిరంతరం వాళ్లలో సత్యాన్వేషణం అప్రయత్నంగా జరుగుతూనే వుంటుంది. స్వర్గరాజ్యంలోనే పసిపిల్లలయొక్క అనుకూలవిహార మన్నాడు జీససుమహాత్ముడు. నిష్కళంక "సత్యము"యొక్క మూర్తీభావమే శిశువుయొక్క జీవితంలో మనకు దర్శన మయ్యేది. శిశువుతో జననమొందే ఆ సత్యజ్యోతిని పోషించి, పెంపొందించడమే తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, పిల్లలసంరక్షకు లందరూ శక్తివంచన లేకుండ నెరవేర్చవలసిన విధి విద్యార్థి హృదయంలో ఈశ్వరదర్శనం చేయడ మెట్లాగో, ఉపాధ్యాయుడు ముందు నేర్చుకుంటేనే గాని మన విద్యావిధానాలు చక్కబడనేరవని ఒక మహాసీయు డన్నాడు. ధర్మానుష్ఠానమనేది వయోవృద్ధులయొక్కయు, వేదాంతులయొక్కయు

ప్రత్యేకసొత్తు కాదు. అది వారికంటె వేయిరెట్లెక్కువ
గా బడిపిల్లలయొక్క జన్మహక్కు—మాయమర్మాలెరు
గని చిన్నబిడ్డలయొక్క సహజమైన విహారభూమి. బ్రహ్మ
విద్యే నిజమైనవిద్య. కనుకనే టాల్‌స్టాయి ఈపుస్తకం వ్రా
శా నన్నాడు.

2. టాల్‌స్టాయి రష్యాదేశస్థుడు. 1910 వ సంవ
త్సరంలో ఎనభైరెండో యేట చనిపోయినాడు. మత,సాం
ఘిక, రాజకీయ బానిసత్వంలో బడి మగ్గిపోతున్న తనదే
శాన్ని ఉద్ధరించడానికే జీవిత మర్పించిన త్యాగమూర్తి.
మనుష్యుడీ ప్రపంచంలో చేసే సమస్తకార్యాలు—అం
తర్జాతీయమహాసమస్యలు మొదలుకొని, సామాన్యగృహ
స్థుని సామాన్యజీవితంవరకు—సత్యంమీదను, అహింస
మీదను ఆధారపడిన గాని, జీవితమే నిరర్థక మని వ్యక్తు
లకే గాక, బందిపోటుతనమే వృత్తిగా జేసుకొన్న 'నవ
నాగరిక' జాతుల కన్నింటికీ నిష్కర్షగా చాటి చెప్పిన ధీ
రుడు. జీసను బోధించిన మహాదాదర్శాన్నే గురిగా బెట్టు
కొని, తాను చెప్పినంతా త్రికరణశుద్ధిగా చేసి చూపిన
ఉత్తమసాధకుడు. పురుషోత్తముడైన జీససుయొక్క ప్రేమ
సందేశాన్ని మన కందజేయుటకు టాల్‌స్టాయివంటి బ్ర
హ్మసాధకునికి తప్ప మరెవ్వరికి అర్హతున్నది?

3. ఇక, జీసను బోధించిన క్రైస్తవమతము మన

కెట్లా ఆదర్శప్రాయ మౌతుందని కొంద రనుకోవచ్చు. జీసను బోధించినది "క్రైస్తవ" మతం గాదు—మనుష్యులందరికీ జీవనాధారమైన ప్రేమతత్వం. ప్రేమ ప్రపంచంలో గూడ స్వజాతి విజాతి భేదాలను కల్పించే దురభిమానాన్ని మించిన నాస్తికత్వం మరొక టుంటుందా? నీ కొక యిల్లు, నా కొక యిల్లు ఉన్నట్లుగానే, క్రైస్తవుల కొక ప్రార్థనమందిరం, హిందువుల కొక ప్రార్థనమందిరం ఉండినా వుండు గాక. కాని మానవకోటినంతను ఒక్క విశ్వాసంతో, ఒక్క ప్రేమసూత్రంతో బంధించి, రక్షించే వుద్దేశంతో భగవంతునిచేతనే నిర్మించబడ్డ విశ్వేశ్వరాలయ మొకటి మనలోపలనే వున్నదని గుర్తింపగలిగి నప్పుడు గాని మన దురభిమానాలూ, మతకక్షలూ నశించవు. ఆ విశ్వప్రేమను పునాదిగా, వేసి కట్టబడని 'చర్చి'లు గాని 'మసీదు'లుగాని, లేక విష్ణు, శివాలయాలుగాని సైతాను నాహ్వానించడానికి కట్టిన పాపగృహాలే యని చెప్పక తప్పదు. క్రైస్తవులలో కొందరు దురభిమానులు ఈసారి పుట్టే క్రీస్తు లండనులో పుడితేనేగాని తాము ఒప్పుకొనేది లేదనవచ్చు. అనంతమును, అమోఘము నగు సత్యము మన వేదశాస్త్రాలలో వున్నది గాని, నిన్న గాక మొన్న బయలుదేరిన 'బైబిలు' లో యేమున్నదని చెప్పి తద్వారా హిందూత్వాన్ని నిలబెట్ట జూచే

దురభిమానులు మాత్రం లేరా? ఇది మాత్రం యేపాటి విశాలదృష్టి? యథార్థక్రైస్తవుని దృష్టిలో క్రీస్తులు తెల్ల దేశములందే గాక, నల్లదేశములందూ, పచ్చదేశములందూ, ప్రపంచమంతటా వ్యాపించే వుంటారు. అట్లాగే ఉత్తమహిందువునకు తన దేశపు పుస్తకాలలోనే గాక 'బైబిలు' 'ఖురాను'లలో గూడ వేదవాక్కు వినబడుతుంది. పరమేశ్వరు డొక్కడే; సత్య మొక్కటే; ధర్మబద్ధమైన మానవహృదయ మొక్కటే. అన్నిచోట్లా, అన్ని కాలాల్లోనూ, ఈశ్వరదూత లందరూ యిచ్చిన సందేశాల మూలసూత్ర మొక్కటే. ఈ యేకాగ్రతతో, యీ విశ్వాసంతో చూస్తే, జీససుసందేశం కూడ తరిచిన కొలది ధర్మసాధకునికి అమూల్యఫలితా న్నిస్తుంది.

4. ఇక యీ తెలుగు తర్జుమానుగూర్చి మరొక్క మాట. మనలో కొందరు 'బైబిలు'ను చదివి యుండవచ్చు. ధర్మగ్రంథాలన్నిటిలాగునే బైబిలుకూడ ప్రజాసామాన్యంలో లెక్కలేని వాదప్రతివాదాలకూ, భేదాభిప్రాయాలకూ గురి అయింది. జీససుకథను అట్టి చీకాకుల నుండి తొలిగించి, అతని సందేశంలో వున్న సారాంశాన్నే అతిసరళంగా, విపులంగా, వ్రాసి సామాన్యప్రజాలోకాని కంద జేసి పుణ్యం గట్టుకున్నాడు టాల్‌స్టాయి. నిర్భీతితో నాటిన ధర్మానుష్ఠానమే జీవితసమస్య లన్నిటికీ పరి

త్రాణోపాయము. ఈదృఢవిశ్వాసం దినదినాభివృద్ధి నొం దుతున్న ఈ నవయుగభారతదేశంలో ఈ పుస్తకం దేశ భాష లన్నిటిలోనికి తర్జుమా కావలసి వున్నది. ఈ యావశ్యకతను గుర్తించుకొనే, నాకు చేతనైన మాటలలో దీనిని వ్రాయ ప్రయత్నించాను. విషయంలో వుండే ప్రాముఖ్యతనుబట్టి, ఇంగ్లీషురాని సోదరీసోదరులందరూ చదువవలెననే ఆశతో—నా అసమర్థత సంతా ఒక పక్కను బెట్టి—దీనిని ప్రకటింప సాహసిస్తున్నాను. లోటుపాట్లుంటాయి—దయ వుంచి తెలుపండి. ఇదే నా ప్రార్థన.

త. ప్రకాశరాయుడు.

ఓమ్.

# జీసను సందేశం

## 1

ప్రతివానిలోను భగవంతుఁడున్నాఁడు. ఇదే జీసను తన ఉపదేశములద్వారా ప్రత్యక్షజీవితంద్వారా చూపిన సత్యం. జీవిత మంటే శరీరంతోడిదే గాని, దానికి ఆత్మతో యేమి సంబంధ మని చాలమందికి సంశయం. ఇందుకే ప్రపంచములో యిన్ని పడరాని బాధలు. ఇంకా మనుష్యులలో యెంత పరస్పరకలహం! ఎన్ని కొట్లాటలు! ఎట్టి మనస్సంతాపం! మృత్యు వనగనే యెంత భయకంపం!!

ప్రేమయే పరమాత్మస్వరూపం. నిజంగా ప్రేమచేతనే మనుష్యుఁడు బ్రతుకఁగలుగుతున్నాఁడు. ప్రేమప్రవాహంలో నిలిచిన వాళ్ళకు, ఇంక శత్రుత్వ మెవరితో? దుర్బలుల మనస్సంక్షోభము వారి నంటదు. మృత్యుభయ మేమో వారికి తెలియదు.

ప్రతిజీవి, తనకు సుఖమునే, మంచినే కోరుకుంటాఁడు. నిజమైన సుఖమును పొందుటకు, ప్రేమ ఒక్కటే జీసను చూపిన మార్గం. సుఖ మనుభవించడ మంటే, ప్రేమ నన్వేషించడమే. ప్రేమనే సర్వస్వంగా చేసుకొనుటకు, ప్రతివానికిని శక్తి కలదు—పొత్తున్నది. ఇదే యీ పురుషోత్తమునిచే ఈలోకాని కందజేయబడ్డ ఉత్కృష్టజీవితతత్వం—పరమేశ్వరుని సువార్త!

# 2

జీసను మేరీకుమారుడు. తండ్రి, జోసెఫ్ — వడ్రం పని వృత్తిగా జేసుకొని బ్రతికేవాడు. తల్లిదండ్రులతోను, తమ్ముళ్లతోను, జీసను 'నాజరెత్' పట్టణములో ముప్పది సంవత్సరాలు జీవించాడు. యుక్తవయస్సు రాగానే వడ్రం పు కార్ఖానాలో తండ్రికి సహాయం చేసేవాడు.

ఆ దినాలలో, జాన్ అనే ఒక సన్యాసి చుట్టుపట్ల అడవులలోనికి, బయళ్ళమీదికి వచ్చి ధర్మబోధ చేసేవాడు. ఆయన ధర్మోపన్యాసాలు వినుటకు జనులు చాలమంది పోతుండేవారు. ఒకనాడు నాజరెత్ నుండి కొందరు బయలుదేరి వెళ్ళుతున్నట్లు జీసనుకు తెలిసి, వారివెంట తాను గూడ పోయినాడు.

జాన్ తన ఉపన్యాసం మొదలుపెట్టినాడు: "ఈశ్వరరాజ్యం ప్రతిష్ఠింపబడబోతున్నది. మనుష్యులందరూ సమానులే; హెచ్చుతగ్గులు లేవు. ప్రేమతో, సఖ్యతతో, అందరూ ఒక్కటికావలె. ఇదిగో, ధర్మరాజ్యం! ఇదే శుభ ముహూర్తం! ప్రేమ వాహినిలోనికి రండి! మీపాపము లను కడిగివేయండి!"

"అయితే, ఇప్పుడు మేమేమి చేయవలె"నని సరళ హృదయులు కొందరు, ధైర్యంగా ఆ సన్యాసిని, అక్కడనే, అడగడం ప్రారంభించారు.

"మీవద్ద రెండుబట్టలుంటే, వెంటనే పోయి వస్త్రహీనునొకని వెదకిచూచి, ఒకబట్ట వాని కిచ్చివేయవలె. మీలో ధనికులు ప్రజల సొత్తును హక్కును అపహరించి బ్రతుకకూడదు. సైనికులు తమ కున్నంతతో సంతృప్తి నొందవలెగాని, ఊళ్ళపైబడి, దోచుకొని ప్రజలకొంపలు మాపగూడదు.

"ఇక్కడ మీలో 'పరసీయులు' 'సదుసీయులు' 'ధర్మోపదేశకులు' ఉన్నారు. మీరందరూ పైకిమాత్రం ధర్మంసైగు చెప్పుకుంటూ, వట్టి వేషధారులై బ్రతుకుతున్నారు. మీరు మీ జీవితాలను మార్చుకోవలె, మీహృదయాలను పశ్చాత్తాపంతో నింపుకొని, ఆ పవిత్రశోకాగ్నిలో మీ పాపాలను కాల్చివేయవలె. మీరు పుట్టుకతోనే యేదైనా ప్రత్యేకపు ఆధిక్యతతో స్వర్గంనుండి దిగివచ్చామనుకుంటున్నారు కాబోలు! మీలో మార్పు కలిగినదీ, లేనిదీ-మీ జీవితాలే స్పష్టంగా చెప్పగలవు. కాయలు కాయని గొడ్డుచెట్టు దేనికి పనికివస్తుంది! కట్టెలుగా విరిగి పోయిలోబడి కాలిపోదా? నిజమైన మార్పు చెందని మొద్దు మీబ్రతుకులు కూడ అంతే! ధర్మబద్ధంకాని జీవితం తప్పక నాశన మౌతుంది" అని మనుష్యుల మూర్ఖతను, నిర్భాగ్యతను తీవ్రంగా ఖండిస్తూ; దయ, న్యాయశీలత, నమ్రత—వీటి ననుష్ఠించి బ్రహ్మతేజం పొంద మని

2

జాన్ అందరిని హెచ్చరించాడు. ఎవ రెవరు తమ జీవితా లను దిద్దుకొనుటకు అప్పటికే దృఢనిశ్చయు లైనారో, వా రందరిని, సంస్కారచిహ్నంగా ప్రక్కనున్న జార్డన్ నదిలో స్నానం చేయించాడు. "నేను మిమ్ములను నీ నదీజలంతో శుద్ధిచేస్తున్నాను. కాని, మిమ్ములను పూర్తిగా పరిశుద్ధులను జేసి అమృతత్వ మిచ్చేది మీ అందరిలో నిండివున్న పర మాత్మ ఒక్కడే!" అనిచెప్పిఉపన్యాసం ముగించాడు. అ మూల్యమైన ఈధర్మోపదేశం జీసను హృదయాంతరాళం లో చొచ్చి, అతని మనస్సును గట్టిగా పట్టివేసింది. తాను విన్న అద్భుతసందేశాన్ని గూర్చి తీవ్రంగా ఆత్మజిజ్ఞాసచేసి అందున్న సత్య మేదో తనలో సార్థకం చేసుకోవలె ననే సంకల్పం పుట్టింది. ఒకవిధమైన ఉత్సాహంతో, తృష్ణతో అతని మనస్సు నిండింది. అప్పుడే తిరిగి యింటికి వెళ్ళిపో తే, తనలో పుట్టిన ఉత్సాహాగ్ని నిస్తేజమై తనమనోనిశ్చ యం యిక సిద్ధిపొందద నుకున్నాడు. అందుచేత అరణ్యం మధ్యనే ఆగిపోయినాడు. చాలదినాలు అక్కడనే గడిపి, తీవ్రవేదనతో గూడిన ఆత్మఘర్షణలో బడ్డాడు.

---

# 3

స్వర్గరాజ్యం స్థాపన కావలెనంటే, పరమాత్మయొ క్క స్పర్శద్వారా పరిశుద్ధులు కావలెనంటే అర్థమేమని

జాన్ ఉపదేశాన్ని గూర్చి జీసను తనలో తానే జిజ్ఞాస చేసు
కున్నాడు. "శరీరసుఖానికై కాక, పరమాత్మకోరకై జీవిం
చుటవలన మనుష్యుడు పరిశుద్ధుడైతే నిశ్చయంగా స్వర్గసా
మ్రాజ్యం స్థాపన కావలసిందే. కాని మనుష్యజీవితానికి
ఆత్మతో మాత్రమే కాక శరీరంతో కూడ సంబంధమున్న
దికదా! ఈక్రొత్తసమస్యకు సమాధాన మెక్కడ?" అని
తర్కించుకొనడం మొదలుపెట్టినాడు. "అసలు శరీరమే
లేదనుకొని, కేవలం ఆత్మతోనే బ్రతుకగలగడ మెట్లా?
అసంభవం కాదా? పోనీ, పూర్తిగా శరీరంతోడిదే బ్రతు
కనుకొనడం, మూర్ఖత మాత్రమే కాక, పెద్దఅపరాధమే
అవుతుంది. ఎట్టి భౌతిక జీవనంలో పరమార్థ మేమున్నది?
ఎక్కడికక్కడ విచ్ఛిన్నతయే దాని ముఖ్యచిహ్నం. ఆ
నిర్జీవస్థితిలో ఆత్మసామ్రాజ్యానికి స్థాన మెక్కడ?—
లేనేలేదు. మరి, లేదని చెప్పి, శరీరాన్ని నాశనం చేయుడం
న్యాయమౌతుందా? భగవంతుని యిచ్ఛచేతనే కదా ఈ
శరీరం మనుష్యుని కియ్యబడ్డది! అట్టి శరీరాన్ని చంపుకుం
టే స్వామిద్రోహులము కామా? ఆత్మ కూడ శరీరంతో
నున్నదే కనుక, శరీరంతో సంబంధ మెట్లా విడిచిపెట్టగల
ము? లేక, పూర్తిగా శరీరదాస్యంలో బహిపమాత్రం యెట్లా
బ్రతుకవచ్చు? దేవుని యిచ్ఛచొప్పున నిర్మించబడ్డ దగుట
చేత శరీరంనుంచి మనంతట మనం విముక్తులము కాగల

మా!—కావచ్చునా? అట్టిస్వాతంత్ర్యమూ, అందు స్వా యత్తా కూడ కనిపించదు. అయితే చేయవలసిన దేమి? ఒక్కటే కనిపిస్తుంది. భగవంతు డిచ్చిన శరీరంతోనే భగ వంతుని నియమానుసారం బ్రతుకవలె. ఇదే యీ జీవన యాత్రకు పరమావధిగా కనిపిస్తుంది. శరీరాన్ని ఆధారంగా చేసుకొనడంలో, శరీరానికి కాదు మనుష్యుడు చేయవల సిన దాస్యం—ఈశరీరాన్నిచ్చిన భగవంతునికి. భవతార కమైన ధర్మసాధనకు ఉపయోగపడడమే బాహ్యేంద్రి యాలయొక్క సార్థకత.” అని, యిట్లా మనోనిశ్చయం చేసుకొనేసరికి, జీససుకు అద్భుతమైన ఆంతరంగిక విశాలత కలిగినట్లయింది. జాన్‌యొక్క ధర్మోపదేశంద్వారా భక్తి భిక్ష పొంది కృతార్థుడైనాడు. బ్రహ్మానందభరితుడై వెం టనే ఆచోటు విడిచి, తాను తెలుసుకున్న సత్యాన్ని గూర్చి ప్రబోధం చేస్తూ, పట్టణాలలోను, పల్లెలలోను, తిరుగుట ప్రారంభం చేశాడు. బొటబొట రక్తపుచుక్కలు రాలేటట్లు తీవ్రవేదనాకరమైన ఆంతరంగికపరిశ్రమంలో మునిగి, మర ల తేలి, ఫలసిద్ధి పొందినాడు. కనుకనే సింహబలంతో కార్య క్షేత్రంలోని కురికి, దవానలం లాగు పాపారణ్యంలో ప్ర వేశించి, ఆ స్వర్గీయజ్యోతిద్వారా హృదయకల్లోలం కలి గించి, పతితు లెందరినో పావనుల జేయ సమర్థుడైనాడు.

# 4

జీసను సత్యప్రవక్తగా బయలుదేరి, గ్రామంనుంచి గ్రామం, పట్టణంతరువాత పట్టణం తిరుగుతూ, తన క్రొత్త జీవనవేదం జనులకందరికి వినిపించడం ప్రారంభం చేశాడు. జీసనుయొక్క ధర్మప్రచారవార్త ఆ జిల్లాఅంతా వ్యాపించింది. క్రమంగా చుట్టుపట్ల దేశమంతటా పెద్ద వదంతి బయలుదేరి, ప్రజలలో బ్రహ్మాండమైన కదలిక పుట్టింది. ఈ క్రొత్త ప్రచారకుని, ఈ వింతదైవజ్ఞుని చూడడానికి, అతని మాటలు వినడానికి ప్రజలు గుంపులుగుంపులుగా బయలుదేరి ఆయనవెంబడి బడ్డారు. ఒక వీధిలో ఆగి నిలబడి జీసను, తనచుట్టూ మూగిన పెద్దజనసంఘాన్ని సంబోధించి యిట్లన్నాడు: "ఆ దినం మీరందరూ అడవికి వచ్చి జాన్ చెప్పిన మాటలు విన్నారు కదా! మీరక్కడికి పోయినదెందుకు? ఆయన యెంత మంచిదుస్తులు కట్టుకున్నాడో చూచుటకా? దుస్తుల సౌందర్యం, భోగభాగ్యాల అట్టహాసం, మేడలలోనూ మిద్దెలలోనూగాని అడవిప్రదేశంలో యేమున్నుంటుంది? మరి, మీరా నిర్జనప్రదేశానికెందుకు పోయినారు? ఆ మహానుభావుడేమన్నాడో మీకు జ్ఞాపకం లేదా? సత్యరాజ్యం స్థాపన కావలె నని; ప్రపంచంలో చెడుగు నిర్మూలం కావలె నంటే, ద్వేషం మాని జనులందరూ పరస్పరపవిత్ర ప్రేమలో

సమిష్టిజీవనం చేయవలె నని బోధించాడు. మన జీవితాలు మార్పుచెందడమే ధర్మరాజ్యస్థాపనకు పునా దన్నాడు. ఆ రాజ్యం, దానంతట అది, కొండమీదినుంచి దిగివచ్చేది కాదు. భగవంతుడే దానిని మూటగట్టి, మీకు చేతి కం దిస్తా డనుకొనడం వెర్రిభ్రమ. దాని నీప్రపంచంలో ప్రతి ష్ఠించే శక్తి మీకే యియ్యబడ్డది. ఆ పని నెరవేర్చవలసిన బాధ్యత కూడ మీదే. మీ జీవితమార్గాలను తిన్నబర చుకొని, ఈశ్వరాజ్ఞాబద్ధులగుటయే ఆ రాజ్యనిర్మాణానికి మూలసూత్రం.

“ఈశ్వర రాజ్యం మీ కండ్లకు కనబడేది కాదు. ‘ఇదిగో! అదిగో!’ అని అనేకు లనేకమార్గాలు చూపి స్తారు. ఆ మాటలకు మోసపోయి, కంగారుగా అటునిటు పరుగెత్తి ఆత్మవంచకులు కావద్దు. పరమాత్మయొక్క ప్రత్యక్ష దర్శనానికి ప్రత్యేక కాలనియమం లేదు; స్థలనిర్దే శమును లేదు. తెలియని అభాగ్యునికి ఎక్కడను ఆ దివ్య సందర్శనం కాదు. వానికి అంతా శూన్యమే, అంతులేని అధఃపతనమే! ధర్మరాజ్యం మీలోపలనే నిండివున్నది. మీ దీనహృదయమే దానికి రాజధాని. కనుకనే, తెలుసు కుంటే అది సర్వత్ర వ్యాపించే వున్నది. స్థలకాల నియ మాలు లేకుండా, సంకల్పమాత్రాన ఎక్కడ బడితే అక్కడ, ఎప్పుడు బడితే అప్పుడు గోచరిస్తుంది.”

# 5

సత్యదీక్ష బూని యిట్లా దినాలు గడుపుతూ, తాను తనసందేశాన్ని యింకను విపులంగా స్పష్టంగా చెపుతూ, మరింత ఉత్సాహంతోనూ, పట్టుదలతోనూ దేశాటనం చేస్తున్నాడు. ఒక సమయంలో చాలమంది తనచుట్టూ చేరి నిలబడ్డారు. వారిందరివంక తేరిపార చూచాడు. స్వర్గరాజ్యం, దాని స్వరూపం, మానవప్రపంచంలో దాని అవతరణం—ఈవిషయాలనుగూర్చి చెపుతూ, "స్వర్గ రాజ్యానికీ, ప్రాపంచిక రాజ్యాలకూ చాలాభేద మున్నది. ధన, మదాంధులకు స్వర్గరాజ్యంలో తావే లేదు. కాని, వీరిదే ఈ ప్రపంచంలో సామ్రాజ్యాధికారం. లోకమంతా వాళ్ళనే పొగడి, గౌరవిస్తుంది. పాప మనే గౌరవం పైన వేసుకొని, అప్పటి కప్పుడు పొంగి పడుతూ వుంటారు. కాని వారు కోరుకునే భోగభాగ్యాలు, డాబుదర్పాలు, సద్వారా కలిగే స్వార్థయుతాస్యత—ఇవే వాళ్ళను ఆత్మ సుఖానికి చాలా దూరంచేసేవి. ధనమే దైవంగా ఎక్కడ ఆరాధింపబడుతుందో, క్షణభోగమే యెక్కడ పరమావ ధిగా యెంచబడుతుందో, అక్కడ యెప్పుడో ఒకప్పుడు సర్వనాశనం కాకతప్పదు. వినమ్రులదే, దరిద్రులదే ఆత్మసామ్రాజ్యం. ఐహికసంపదలను తృణప్రాయంగా సన్నివేయగలిగిన వారే స్వర్గార్హులైన దరిద్రులు. పట్టి

పేరుప్రతిష్ఠల సంపాదన ఘోరపాపంగా యెంచుకునే వాళ్లే నిజమైన వినమ్రులు. స్వీరాసతో యెంత ప్రయత్నించినా ధనికులు కాజాలని దరిద్రులు; గొప్పగొప్పలకు తలక్రిందుగా ప్రయాస పడిపడి, నిరాశతో అణగిపోయిన వినమ్రులు, చవిలేని ఉప్పుమాదిరి, నిష్ప్రయోజకులు. అటువంటి కృత్రిమదరిద్రులు ధనికులుగానుంటే ఎంత ప్రయోజనమో, దరిద్రులైనా అంతే లాభం.

“చూడండి మీరు! కావలసిన దొక్కటేవస్తువు. ఈశ్వరరాజ్యాన్ని, స్వర్గసార్వభౌముని ధర్మశాసనంయొక్క ఆచరణసూత్రాన్ని వెదకి పొందగలిగితిరా, మీ జీవితాలకు అవసరమైన మిగిలిన సమస్తవస్తువులూ దానివెంటనే వస్తని.

“నేను మీకు చెప్పతున్న దొక కొత్తవయం కాదు. అనాదిసిద్ధమైన సనాతనధర్మమే యిది. దీనినే అనేకమంది మహానుభావులు, యుగపురుషులు బోధించి పోయినారు. ఈ ధర్మం మీ జీవితాలలో నెరవేరడ మెట్లాగో మీకు చూపుటకే నే జేసే ప్రయత్నం. ధర్మాన్ని నెరవేర్చడ మంటే భగవంతుని ఆజ్ఞలు శిరసావహించడమనే సరియైన అర్థం. శిరసావహించడ మనగా, మోసగాళ్ళవలె కేవలం మాటలతో గాదు—చేతలలో! ఎవ్వ డీశ్వరాజ్ఞను తనప్రాణంతో పరిపాలిస్తూ, యథార్థమైన

ఆచరణద్వారా ధర్మజ్యోతిని యితరుల కందిస్తాడో, అతడే
స్వర్గరాజ్యాన్ని నిరాఘాటంగా పొందగలుగుతాడు" అని
జీసను తనచుట్టూ మూగిన జనసంఘానికి ఉపదేశించేశాడు.

## 6

ధార్మికజీవనంలో సాధించవలసిన కొన్ని ముఖ్య
నియమాలు సూచిస్తూ, జీసస్ ఒకనాడీ విధంగా చెప్పి
నాడు: "మీ ధర్మశాస్త్రంలో యేమున్నది? హత్య
చేయకూడదని, హత్యలు చేసేవాళ్ళు పాపాత్ములని మీ
ధర్మగ్రంథం చెప్తున్నది కదా! హత్యయే కాదు,—నీవు
పరులనిమీద కోపగించుకున్నా, ఆ క్రోధమే భగ
వానుని దృష్టిలో పాతకమైన హత్య అని నే నంటాను. దానికి
తోడు మోటుగా అనరాని దూషణ కూడ చేస్తే అంత
ఘోరపాతక మౌతుంది. క్రోధంతో నిండిన హృదయం
తో నీవు భగవానుని ప్రార్థన కెట్లా చేయగల్గుతావు? ప్రార్థన
సమయంలో నీకు ఎవరిమీదనైనా క్రోధమున్నట్లు స్ఫుర
ణకు వస్తే, వెంటనే లేచిపోయి నీ శత్రువుతో సఖ్యపడి
మరీ రావాలి. నిర్మలాంతఃకరణ లేనిదే నిజమైన ప్రార్థన
యెక్కడిది? లేదా, సహృదయాన్ని అక్కడే, అప్పుడే
పూర్తిగా నాశనం, స్నేహశీలమైన కూర్పు కలిగితే గాని నీ
ప్రార్థన ఫలప్రదం కానేరదు. ఇదే ధార్మికజీవితంలో
మొదటినియమం.

"వ్యభిచారం చేయరాదనీ, విడుదలపత్రం వ్రాసి యివ్వకుండ భార్యను విడిచిపెట్టకూడదనీ మీ శాస్త్రం లో చెప్పినారు. వ్యభిచరించకపోవడమే కాదు,—చెడ్డ తలపుతో స్త్రీవంక కన్నెత్తి చూచినా, పరమాత్మయెదుట పాపమే యని నావిశ్వాసం. అసలు భార్యతో విడుదల చేసుకొనడమే వ్యభిచారదోష మని నే నందును. అట్టివాడు భార్యను కూడ దోషిని చేసినవా డౌతాడు. అంతే కాదు,—తాను విడిచివేసిన తనస్త్రీని కట్టుకునే మూడవ వ్యక్తియొక్క పాపపు బ్రతుకునకుగూడ ఇతడే బాధ్యుడు. ఇదే రెండవ ధర్మసూత్రం.

"ఒట్లు పెట్టుకొనుట, ప్రమాణాలు చేయుట తప్పు; భగవంతునిమీద చేసే ప్రమాణాలకు మాత్రం భంగం రాకుండ నిలబెట్టుకోవలెనని మీ ధర్మగ్రంథంలో చెప్ప బడ్డది. కాని నాసందేశ మిది: మీ రెవ్వరూ మనుష్యుని మీదగాని దేవునిమీదగాని అసలు ప్రమాణమే చేయ గూడదు. ఎవరైన యేదైనా అడిగినప్పుడు, అయితే 'అవును' ని, లేకపోతే 'కాదని' నిష్కర్షగా చెప్పివేయ డమే పరమధర్మం—నిజమైన మనుష్యత్వం. మన మెప్పుడూ భగవంతుని ఆజ్ఞకు లోబడి యుండవలె గదా! మనచేత భగవంతు డెప్పుడేమి చెప్పిస్తాడో, యేమి చేయి స్తాడో తెలియగు కనుక, ముందాయన ఆజ్ఞ యేదో తెలి

యకుండ, ఒట్లూ వాగ్దానాలూ చేయతగదు. కనుక, "తా
నేమేమో నెరవేర్చెద నని గొప్పగా చెప్పుకుంటూ, ముం
దుగానే ఒట్లూ, శపథాలూ చేసి ప్రగల్భాలు పలుకుట
సాహసమే కాదు—స్వామిద్రోహ మనవలె. ఇది మీరు
పాటించవలసిన మూడవ నియమం.

"ఇంకా మీ పురాణగ్రంథ మేమి చెవుతున్నదో
వినండి: 'కన్నుకు కన్ను, పన్నుకు పన్ను'—ఇదే ధర్మ
మని చెప్తున్నది. అనగా హింసకు హింసే తగిన ప్రతీ
కారమని అర్థము. నేనుమాత్రము అట్లనను. కీడును కీడుతో
యెదుర్కొనుట అక్రమం. నీ కన్ను పొడిచి నీకు బాధ
కలిగించిన వాని కన్ను తిరిగి పొడిచివేసి, నీ పన్ను పెరిగ
గొట్టిన వానిని తిరిగి అదే విధంగా హింసజేసి పగతప్పు
కొనడమే ధర్మ మని నమ్మి బ్రతికేది పాపపు బ్రతుకు.
దెబ్బగొట్టిన వానిని తిరిగి దెబ్బకొట్టడం కేవలం అమాను
షం! నిన్నొక చెంపమీద కొడితే, ఓర్చుకొని, వెంటనే
నీ రెండవ చెంప కూడ నీ శత్రువుకు అందియ్యగలిగితే—
అదే శౌర్యలక్షణం! తన కోటు చొక్కా నియ్యమని ని
న్నొక డడిగినాడనుకో. వానిమీద విసుగుకొని, తిట్టి
వెళ్లగొట్టి వానిని నిశత్రువుగా జేసుకునేది ధర్మమా?
అడిగిన చొక్కాకుతోడు నీ దొరకోటు కూడ ప్రేమతో
వాని కిచ్చి పంపడమే ఉత్తమధర్మం కాని, చెడుగుకు

తిరిగి చెడుగుతో యెదుర్కొనుట పాపపు పని. ఇది నా
ల్గవ ధర్మనిబంధన.

“ మీ జన్మభూమి, మీ దేశపుప్రజలు మాత్రమే
మీ ప్రేమకు పాత్రులనీ, పరదేశస్థు లందరూ జన్మసిద్ధం
గానే మీకు శత్రువులనీ, మీ నీతిశాస్త్రం మీకుబోధిస్తు
న్నది. కాని అది విశ్వపితయైన భగవంతుని ప్రేమతత్త్వా
నికి పూర్తిగా వ్యతిరేకం. స్వజాతి విజాతి భేదం లేకుండ,
మీరు అందరినీ—ప్రతివానినీ—ప్రేమించవలె. కొందరు
మీమీద శత్రుత్వమే సాధిస్తారనుకొందాం. అసహ్యించు
కుంటారు, దూషిస్తారు. ఇదిగాక ఎదురుగా మీదికి వచ్చి
డీకుంటారు—దయాదాక్షిణ్యాలు లేకుండ, ఇంకా చెప్ప
రాని హింసలు పెడతారు. అట్టిశత్రువులనే మీరు త్రికర
ణశుద్ధగా ప్రేమించి, హృదయబంధువులనుగా జేసుకొని
పంపవలసియుండగా, మిగిలిన (శత్రువులుగాని) సామాన్యు
లనుగూర్చి చెప్పే దేమున్నది? అందరూ ఒక్కతండ్రి
బిడ్డలే! తోడబుట్టినవాళ్ళే! ఒకప్పుడు మనను క్రోధం
తో విడిచినా, వారూ మన ప్రియసోదరులే. ఇక జాతిభే
దాల కవకాశ మెక్కడ? అప్పుడు ప్రేమలో హెచ్చు
తగ్గులు మాత్రి మెంచకు! గొప్పవా డెవడు? కొద్దివా
డెవడు! మిత్రు లెవరు? శత్రువు లెవరు? ఇందుచేతనే
మీరు ఈశ్వరకుటుంబము నంతను సమానప్రేమతో ప్రే
మించవలె. ఇదే కడపటి ధర్మసూత్రం. ”

# 7

జీసను ఈవిధంగా అనేకచోట్ల ధర్మప్రచారం చేస్తు న్నాడు. జనసమూహం అంతకంతకు హెచ్చిపోవడం మొదలుపెట్టింది. తన ప్రపదేశాన్ని ప్రజలు ఆచరణలో పెట్టడంవల్ల కలిగే ఫలితాన్ని గూర్చి మరొక సమయంలో యిట్లా బోధచేశాడు. "మీ రందరూ నా ప్రపదేశాను సారం,— మీలో ద్వేషం లేకుండ, అందరితో సఖ్యంతో ప్రవర్తిస్తూ, వ్యభిచారపాపానికి దూరంగా, ఒట్టు పెట్టుకొనుట మాని, ఉన్నది లేదనక మృదువుగా పలుకుతూ, శత్రువులను సహితం ప్రేమిస్తూ వుంటే మీ ప్రవర్తన దివ్యమైనదై, సుఖం లేకుండా పోతుందేమో అని భయపడకండి. ఇంతకంటె తప్పక చాలా బాగుపడుతాం అని నమ్మండి. సందేహ మెందుకు? మహోన్నతమైన యీ ధర్మశాస్త్రం మనకు కేవలం భగవంతుని మహాప్రసాదమే! సర్వోన్నతుడైన ఈశ్వరుడు, మనం పాడైపోవుటకు కాదు— యీ శాసనం మన కిచ్చినది; మన బ్రతుకులు చక్కబడి యథార్థజీవన లాభం పొందుటకే.

"మీ రీనియమాలను పాటించి బ్రతుక నిశ్చయించుకొనడమే స్వర్గరాజ్యాన్ని ప్రతిష్ఠించడం. మీ దారిని మీరు సత్యదీక్షతో స్వామికార్యానికి పూనుకుంటే, మీ కవసరమైన దంతా వెనువెంటనే మీకు లభిస్తుంది.

"పశుపక్షుల జీవితాన్ని గూడ శాసించేది యీ యమోఘశాసనమే. వాటి నియమాల ననుసరించి అవి బ్రతుకుటచేతనే వాటి జీవనయాత్ర సుఖంగా గడిచి పోతున్నది. అట్లాగే మీరు కూడ ఈశ్వరాజ్ఞకు బద్ధులైతే అంతా సవ్యంగా జరుగుతుంది.—జన్మసాఫల్య మౌతుంది. ఈ మాట లేవియు నావి కావు. ఇది భగవంతుని అమోఘ శాసనం,—ప్రతిమానవుని హృదయంలోనూ యిమిడివున్న సనాతనధర్మసూత్రం. తన బిడ్డలయొక్క యోగక్షేమం కొరకు కాకపోతే, విశ్వేశ్వరుడీ యాజ్ఞలనే యిచ్చియుండడు. భగవంతునియందు త్రికరణశుద్ధియైన చలింపని విశ్వాసం, నీ పొరుగువానిని నీతోబుట్టువువలె—నీవలె—ప్రేమించుట: ఇదే యీ ధర్మచట్టంయొక్క సారాంశం. ఇతరులు నీ యెడల ఎంత గౌరవప్రీతులు చూపవలెనని కోరుకుంటావో, వారియెడల నీవు కూడ అట్లాగునే వర్తింపగలిగితే, ఈ ధర్మనియమాలను సాధింపగలవు.

"ఎవరైతే నా వుపదేశం శ్రద్ధాభక్తులతో విని, భగవదాజ్ఞను నిర్భీతితో అమలుజరుపుతారో, వారి జీవితం రాతికొండలో పునాదివేసి కట్టిన కోటవంటిదని చెప్పవచ్చు. అంత గట్టియింటికి, ఎంత వర్షం, యెన్ని వరదలు, గాలివానలు వచ్చి కొడితేమాత్రం యేమి భయం? ఏమి నష్టం? అట్లుగాక, నా మాటలు విని కూడ, ఆచరణలో

కూర్చి అత డేమీ ప్రశ్నించుకోనడు. నాటిన గింజను అత్యద్భుతంగా అన్ని మార్పులు పొందించడంలో మనుష్యుని ప్రయత్న మేమున్నది? అతడు పడవలసిన తాపత్రయ మేమున్నది? ఆ బాధ్యత అంతా మహిమాన్వితుడైన భగవంతునిదే. పంట కోతకువచ్చినప్పుడే పొలంకాపు పని వాళ్ళను పంపి పంట కోయించి, కుప్ప వేయిస్తాడు.

"అట్లాగే ఈ ప్రపంచంలో స్వర్గరాజ్యస్థాపనచేసే బాధ్యత భగవంతుడు తనమీద పెట్టుకోనడు. దానికి కావలసిన శక్తిసామర్థ్యాలు, సాధనసంపద మనుష్యునికే ఇయ్యబడ్డవి. రక్తాశ్రువులు రాల్చియైన, మనుష్యుడే ధర్మరాజ్యప్రతిష్ఠ చేయవలసి యున్నాడు."

జీసను మరొక కథ చెప్పినాడు: "చేపలకొరకు సముద్రంలో వలలు వన్నే జాలరితో కూడ స్వర్గరాజ్యాన్ని పోల్చవచ్చు. వలలో అనేకరకాల చేపలు పడినప్పుడు, జాలరి యోగ్య[illegible]కానివానిని విడదీసి పడతోసి, తనకు కావలసిన వాటిని తీసుకొని, పనికిరాని వాటిని తిరిగి సముద్రంలో విసిరేస్తాడు. అటువంటిదే భగవంతుని పరీక్ష కూడా. ఆ సర్వజ్ఞుడు మన[illegible] యుగాంతంలో అనుకూలురని పరిశీలిస్తూనే వుంటాడు, [illegible] జాలరి చేపలను చేసినట్లే, విడదీస్తాడు. స్వర్గరాజ్యానికి వాళ్ళు [illegible] [illegible] వేస్తాడు. సాధనశీలురైతే, స్వర్గ

భవంద్వారా తమ అర్హతను తాము గుర్తెరిగేపర్యంతం, వాళ్ళను పాపిపంచక పరివృత్తులలోనే విడిచివేస్తాడు."

ఈ సత్యాన్ని నిరూపించడానికే జీసను యింకొక కథ చెప్పినాడు: "ఒక భూస్వామి తనపొలంలో మంచి విత్తనాలు చల్లి వచ్చాడు. గింజలు మొలకెత్తి పెరగడం ప్రారంభించాయి. వాటితోపాటు చాల కలుపుమొక్కలు కూడ మొలిచినవి. పనివాళ్ళది చూచి యజమానివద్దకు వచ్చారు. పొలంలో కలుపు చాలా మొలిచిందని చెప్పి, యజమాని ఆజ్ఞ అయితే పోయి కలుపు లాగి వేస్తామని చెప్పినారు. యజమాని అందు కొప్పుకో లేదు. 'కలుపు లాగేటప్పుడు మీరు వాటితో కలిపి పంటమొక్కలు కూడ పెరికివేయగలరు. చేను కోసేటప్పుడు పంటను పోగు చేసుకొని, పనికిరాని మొక్కలు పారవేతాము. కనుక ప్రస్తుతం రెండూ కలిసి పెరగ నియ్యవలసినదే' నన్నాడు యజమాని. అట్లాగే మనం కూడ, మంచిచెడ్డలు గుర్తింపలేని మన మూర్ఖతవలన, తొందరపాటువలన, ప్రపంచం లోని చెడుగును నిర్మూలం చేస్తామని పోయి, మంచినికూడ నాశనం చేస్తాము, అందుకే భగవంతుడు కూడ, మన ద్వారా యితరుల నైతికసుఖానికి హాని కలగడం హర్షించడు. ఆయనకూడ అట్టి మూర్ఖులతో మాటిమాటికి జోక్యం కలిగించుకొనడు. ప్రతివారూ స్వప్రయత్నంద్వారానే భగవంతుని సమీపించవలె."

---

# 9

స్వర్గరాజ్యపదవినిగూర్చి జీసను తిరిగి ఈ కథ చెప్పినాడు: "భూమిలో విత్తనాలు వెదజల్లినప్పుడు అన్నిగింజలూ ఒకే మాదిరిగా ఫలించవు. కొన్నిగింజలు చెదిరి బాటలో పడతవి; పక్షులొచ్చి వాటిని యెత్తుకొని పోతాయి. కొన్నిగింజలు వచ్చి రాతినేల మీద పడటంచేత, మొక్కలు వేరుదన్నుటకు తావులేక మొలిచిన వెంటనే మాడిపోతవి. మరికొన్నిగింజలు ముండ్లకట్టవలో చిక్కుకొని అణగిపోయి నశిస్తాయి. కొన్నిమాత్రమే మంచివ్రిదేశంలో బడి, యేపుగా పెరిగి, ఒక్కొక్క గింజ నూనూరుగెట్లుగా ఫలిస్తుంది.

"ఈలాగే, అందరి జీవితం ఒకే మార్గాన్ని బట్టిపోదు. కొందరుంటారు,—అంతర్వాణిని తమదగ్గరకే చేరనియ్యరు. భయంకరమైన ప్రలోభనాలెన్నో వెన్నంటి తరుముకొని వచ్చి, లోపలి ధర్మచింతను కాస్తా యెత్తుకొని పోతవి. ఈజీవితాలే బాటలో బడ్డవిత్తనాలు. మరికొందరుంటారు,—రాళ్లలో బడ్డగింజలవలె. ప్రారంభంలో ధర్మమార్గాన్ని ఆప్యాయమానంగా స్వీకరించి, కొంచె మిబ్బంది, వడిదుడుకు రావడంతోనే, భయపడి చెదిరిపోతారు. తరువాత, ముళ్లకంపలలో బడి అణగిపోయిన గింజల స్వభావం కొందరిది. వీరు కూడా ఆత్మనత

త్త్వాన్ని అవగాహన చేసుకున్న వ్యక్తులుండి, ధర్మాన్ని చే పట్టి, ధనకాంతలు మొదలైన ప్రాపంచిక తాపత్రియాలలో గిజగిజ కొట్టుకొని నశిస్తారు. ధర్మరాజ్యపదవియొక్క విలువను, బాధ్యతను తెలుసుకొనడమే కాక, దానిని తమజీవితాలలో నిష్కర్షగా అమలు జరుపగలిగే పుణ్యాత్ములు, ధీరులు, చివరకు కొందరే మిగులుతారు. వీరే ఉత్తమభక్తులు,—మంచిక్షేత్రంలో బడి, నూరురెట్లు ఫలమిచ్చే గింజలు. వీరొకరికి భయపడరు. ఒకరి బహుమానమునకు పొగడ్తకు పొంగిపడరు. ఒకరు చేసే పరాభవమును లెక్క చేయరు. స్వతంత్రబుద్ధితో, దైవమును నమ్మి వర్తిస్తారు. ఈ వీరుల చరిత్రలే ప్రపంచానికి నిజమైన సంపత్సమృద్ధి నిచ్చేవి.

"ఎవడు తన [illegible]యబడ్డ అమూల్యవస్తువును సద్వినియోగం చేస్తూ, దానిని జాగ్రత్తతో కాపాడుకుంటాడో, వాని సంపద అమితంగా అభివృద్ధి పొందుతుంది. అట్లా దయచేయబడ్డ వరప్రసాదాన్ని పాడుజేసి పోగొట్టుకునే వానికి, దానితోపాటు యిదివరకున్నది కూడా నాశనమైపోతుంది. కనుక, మీ శక్తులన్నీ వినియోగపరచి ధార్మికజీవిత మనే అమూల్యధనాన్ని మీరు పొందవలసియున్నారు.

"ఒకానొక స్థలంలో ఒక పెద్దధనరాశి పాతిపెట

బడి వున్నట్లు ఒకడు విన్నాడు. వెంటనే తన కున్నదంతా అమ్మివేసి, తా నాపొలం ధరయిచ్చి కొని ధనికుడైనా డట. అట్లాగే స్వర్గీయధనంకొరకు ప్రతిప్రాణియు పరిత పించాలి!

"చూడండి! ఒక్కొక్క చిన్నగింజ మహావృక్షం గా పెరిగి, యెంత బ్రహ్మాండంగా భూమి నావరిస్తుందో! అట్లాగే ధార్మికజీవితంకొరకు మీ రెంత స్వల్పంగా ఆత్ర త, ప్రయత్నం చూపి నప్పటికీ, అదే కోటిరెట్లుగా వృద్ధి పొంది మితిలేని ఫలిత మిస్తుం దని మాత్రం మరువకండి!

" 'ధార్మికజీవితం!'—అ దెక్కడ? మీలోపలనే వున్న దన్నాను. స్వప్రయత్నమే, ఆత్మప్రబోధమే, స్వతం త్రధార్మికచలనమే, ప్రతిసాధకునీ అక్కడకు చేర్పగలవు."

---

# 10

'నికోడిమస్' అనే పరిశీయు డొకడు జీసను చెప్పిన మాటలు విన్నాడు. జీససువద్దకు వచ్చి ఈశ్వరరాజ్యం మ నలోనే వున్నదని తెలుసుకొనడ మెట్లాగో చెప్పమని అడి గినాడు.

"ఆహా! నిశ్చయంగా మనలోపలనే వున్న దది. కాని దానిని ప్రవేశించుటకు మనలో ఒక్కొక్కరమూ క్రొత్తజన్మ మెత్తవలె"నని జీసను బహులు చెప్పినాడు.

'నికోడిమస్' తిరిగి ప్రశ్నించాడు. "ఒకసారి పు
ట్టిన మనుష్యుడు తిరిగి పుట్టడ మెట్లాగు? మరొకసారి తల్లి
కడుపులోనికి పోయి ఎవరైనా తిరిగి రాగలరా?"

జీసను బదులు చెప్పినాడు: "తిరిగి జన్మించడ
మంటే అర్థమది కాదు. మనోవికాసం కలిగి, లోపలి
కన్ను తెరవవలె. తిరిగి జన్మ పొందవలసినది ఆత్మజ్ఞానం,
శరీరం కాదు. ఆత్మజనన మంటే ప్రతివ్యక్తిలోనూ పర
మాత్మ సజీవమైవున్నదనే జ్ఞానాన్ని సంపాదించడమే.
మాతృగర్భంనుంచి పుట్టడంతోనే మనుష్యుని బ్రతుకు
పూర్ణత నొందదు. పరమాత్మనుంచి పునర్జీవనం పొందిన
ప్పుడే జన్మయొక్క సార్థకత. భౌతికశరీరంనుంచి పుట్టేది
భౌతికపదార్థమే. అది ఆధివ్యాధులకు లోనయ్యేదే,—
ఎప్పుడో నశించేదే. ఆత్మనుంచి బహిర్గతమయ్యేది తిరిగి
ఆత్మయే. తనంతట తాను నిలువగలిగినది, బాధలకు లొం
గనిది, చావులేనిది అదే! అటువంటి ఆత్మజ్ఞానోదయమే
నవజీవనం—చిరజీవనం.

"భగవంతుడు మానవహృదయాన్ని తన ఆత్మతే
జంతో నింపివేశాడు. మనుష్యునికి స్వర్గీయానందంతో
గూడిన అనశ్వరజీవితం కల్పించడమే ఆయన వుద్దేశంగాని
బాధించి నశింపజేయుట యెన్నటికిని కాదు.

"ఈ జ్ఞానమే ప్రతివానికీ జన్మసొత్తు. ఇదే స్వర్గ
రాజ్యం!

"ఏదో ఒకస్థలంలో, ఒకానొక సమయంలో మాత్రమే స్వర్గపదవి చేకూరుతుం దని మీరెవ్వరూ అనుకోనగూడదు. అది మీలోపలనే వున్నదని చెప్పేవున్నాను. అది సర్వత్రా వ్యాపించి వుంది. దాని ననుసరించి, నిశ్చితితో బ్రతుకగలిగే బ్రహ్మవేత్తలకు, ప్రతిక్షణమూ, అన్ని చోట్లా అది ప్రత్యక్ష మౌతుంది. ఆ స్వర్గసామ్రాజ్యమే నిరంతరమూ వారి యునికిపట్టు. వారికి జరామరణాలు లేవు. ఇది తెలుసుకోలేక శరీరం కాపుదలకొరకే యెవరు పాకులాడుతారో వారిబాధ దుర్భరం,—మరణమూ భయంకరమే!"

## 11

జీససుబోధను చాల భక్తిశ్రద్ధలతో విని, కొందరు ఆయన చూపినమార్గాన్ని అనుసరించడం మొదలుపెట్టినారు. పరసీయు లిది చూచి సహించలేక, ప్రజలయెదుట నే జీససుమీద యేదోనేరం మోపి, అతనిని అవమానించడమే పనిగా పెట్టుకున్నారు.

ఒక శనివారంరోజున, జీససు తనశిష్యులతో కలిసి, పంటచేలమధ్య, దారివెంబడి పోతున్నాడు. శిష్యులలో కొందరు కొన్ని ధాన్యపుకంకులు కోసి తిన్నారు. యూదులమతంలో శనివారంనా డేమీపని చేయగూడదనీ, ప్రార్థ

నమాత్రం చేయవలసిందనీ, భగవంతుని ఆజ్ఞగా చెప్పబడ్డ
ది. జీసస్‌యొక్క శత్రువుల కిప్పుడు సమయం చిక్కింది.
ఒకనాడు కొందరు పరసీయులు జీసస్ శిష్యుల నొకచోట
ఆటంకపరచి అడిగినారు. "శనివారంనాడు పనేమీ చేయ
గూడదని మీకు తెలియదా? మొన్న మీరు చేసినపని
యేమి? ధర్మశాస్త్రప్రకారం మీకు మరణదండన విధించ
వలె!" అని చెప్పి వారి నెదుర్కొన్నారు. జీసస్ ఈమాట
లు విని పరసీయులతో జవాబు చెప్పినాడు: "భగవంతునికి
కావలసినది ప్రేమగాని, హత్యలూ బలులూ కావని
'మోసెస్' చెప్ప లేదా? దీనిఅర్థం మీ రెరిగివుంటే, నా
అనుచరులను మీ రిట్లా ప్రశ్నించి యుండరు. శనివారాల
కంటె మనుష్యులజీవితా లెక్కువ కావా!" అని చెప్పి
వాళ్లను మందలించాడు. దానికి జవాబేమి చెప్పవలెనో
వాళ్లకు తెలియలేదు. పిమ్మట మొత్తిపట్టూరకొని వెళ్లిపో
యినారు.

మరొకరోజున జీసస్ 'మాత్యూ' అనే ఒకనియిం
టికి పోయినాడు. మాత్యూ ఒక గ్రామతలారి. జీసస్ అ
తనియింట్లో ఆతిథ్యంపొంది భోజనంకూడా చేశాడు. పర
సీయు లిది చూచారు. అయింటి వాళ్ళందరూ పాపాత్ము
లని, విశ్వాసహీనులని, వాళ్ళతో కలిసి తినడం శాస్త్రవి
రుద్ధమని, జీసస్‌తో ఒక పెద్దరాద్ధాంతం బయలుదేర దీ

శారు. దానికి జీససిట్లా జవాబు చెప్పినాడు: "ఎవరెవరు నిశ్చలబుద్ధితో సత్యాన్ని అన్వేషిస్తారో, వారిలో ప్రతి ఒక్కనికీ సేవచేయడమే నాజీవితకార్యం. మీరు భగవద్విశ్వాసులని మీకు సమస్తం తెలుసు నని మీరనుకుంటారు కనుక, యిక మీరు నేర్చుకోవలసిన దేదీ లేక పోవచ్చు! దీనినిబట్టిచూస్తే విశ్వాసహీనులే ముఖ్యంగా బ్రహ్మవిద్య పొంది తరింపవలసిన వాళ్ళని మీరు కూడ ఒప్పుకోవలసి నదే. భగవత్సేవ చేసే మనము, వారియింటికే పోకూడక పోతే, వాళ్లతో కలిసి మెలిసి వుండడమే తప్పిదమైతే, వాళ్లకు మరి ధర్మ మెట్లా తెలియవలె?" పరసీయులు దీనికేమీ జవాబు చెప్పలేక లజ్జపడ్డారు. కాని యేదో నెపం పన్ని జీసస్‌నెట్లాగో శాధించాలని కనిపెట్టుకొని వున్నారు. జీసస్‌శిష్యులొకరోజున కాళ్ళూ, చేతులూ కడుగుకొనకుండ భోజనానికి కూర్చున్నారని నిందించడం మొదలుపెట్టినారు. జీసస్ దానికి ప్రత్యుత్తర మిచ్చాడు: "చేతులు కడుగుకో లేదని కదా మీరు నన్ను నిందిస్తారు! బయటనుంచి కడుపులోనికి పోయేతిండిగాదు మనసు మైల పరచేది. మనసులోనుంచి బయటకు వచ్చే చెడుగే నిజంగా మనసు నాశనం చేసేది. వ్యభిచారం, హత్య, దొంగతనం, ఆశాపాతకం, క్రోధం, మోసం, అసూయ, పరనింద, గర్వం—ఇవే లోపలినుంచి బయలువెడలే కుళ్ళు. ఈమైల

మాత్రమే మనుష్యుని బాగు చేయగలదు. తోటిమానవుల మీద చూపే ప్రేమయే హృద్రోగాల నన్నిటినీ అమోఘంగా హరిస్తుంద"ని జీసస్ బదులు చెప్పినాడు.

---

## 12

ఒకరోజున జీసస్ తనశిష్యుల నొకచోట కూర్చోబెట్టి, భగవద్ధ్యానంకొరకు తాను కొంతసేపు కొంతయెడంగా పోయినాడు. ప్రార్థన మరియు గానే శిష్యులతనివద్దకువచ్చి గురువును సంబోధించి, "స్వామీ, ప్రార్థనావిధాన మెట్లాగో మాకు ఉపదేశించండి"ని అడిగినారు. దానికతడిట్లా జవాబు చెప్పినాడు: "ప్రార్థనసమయంలో మిమ్మల్ని అందరూ చూచి మెచ్చుకొనేటట్లు అహంకారంతో ప్రార్థన చేయరాదు. అది మనుష్యుల మెప్పుకొరకు చేసే ప్రార్థన కాబట్టి, మనుష్యులిచ్చే స్తుతిగానం మాత్రమే దానికి కలిగే ప్రతిఫలం. ఆత్మకు దానివల్ల ఇంచుకైనా ఫలితం లేదు. మీకు నిజమైన భగవత్ప్రేమ ఉంటే, నిర్జనప్రదేశానికిపోయి అక్కడ ఏకాంతంగా భగవద్ధ్యానం చేసుకొనండి. అట్టహాస మేమీ లేక హృదయపూర్వకమైన ప్రార్థనే చేసే భగవంతుడు వారిని ఆశీర్వదిస్తాడు.

"మీరు మీ ప్రార్థనలలో అనవసరంగా మాట్లాడరాదు. ప్రార్థనంటే వట్టిమాటల పోగు కాదు. మీకేది

అవసరమో జగత్పితకు తెలియదా? నోరు తెరచి మీ రేమీ అడగకపోయినా, మీ అవసరాలన్నీ సమస్తం తెలిసిన భగవానుడే తీరుస్తాడని జ్ఞప్తియం దుంచుకొనవలె.

“ మీరు తెలుసుకోవలసింది, చేయవలసింది ఒక్కటే — మీ అంతర్యమును మాత్రం పరమపవిత్రంగా నుంచుకోవలె. ధర్మరాజ్యం మనలో స్థాపన అయితీరవలెననే సత్యదీక్షయే జీవితాన్ని నింపివేయవలె. స్వేచ్ఛాచారులము గాకుండ విశ్వనియంతయొక్క యిచ్ఛానుసారం బ్రతికే నిశ్చయం కావలె. ఏపూటకేది ప్రాప్తమో దానితో ఆకలి తీర్చుకొని కృతజ్ఞులము కావలె గాని, కావలసిన దానికంటె యెక్కువగా పోగుపెట్టి దాచుకొనుట మహాపరాధం. తోడిమానవుల లోటుపాట్లు క్షమించి సవరించుట్లలో భగవంతుని సహాయ మొక్కటే మనకు దారిచూపగలదని విశ్వసింపవలె. సమస్తప్రలోభనాలనుండీ చెడుగు నుండి బయటపడే శక్తిని సాధింపవలె — దానికొరకు విడువకుండ ప్రార్థన చేయవలె.

“ ఇదిగో మన మనుసరింపవలసిన ప్రార్థనపత్రికాళిక

‘ విశ్వపితా, నీవు స్వర్గాధిపతివి. నీనామమే పవిత్రమైనది! నీ ధర్మరాజ్యాన్ని మాలోపల నిలుపుమోయి తండ్రీ! ఎల్లప్పుడూ మాలోపలను ఈ సమస్తపృథివిలోపలను

నీయిచ్ఛయే నెరవేరేటట్లు అనుగ్రహించు! ఈ పూటకు మా కేదో యింత యిచ్చి మా శరీరపోషణయు నీవేకదా చేయవలె! పాపిష్టులమైన మమ్ము క్షమించి పశ్చాత్తాపం ద్వారా పరిశుద్ధులనుగా జేసే భారమూ నీదే! మా తోడి మానవుల లోటుపాట్లను సవరించి మన్నింపగలిగే శక్తి నిమ్ము. చెడుగునుంచి, అన్నిప్రలోభనాలనుంచి మమ్ము తేల్చి, గట్టెక్కించి రక్షించు'

"ఇదే నేను సూచించే ప్రార్థనవిధానం. మీ కుండే కోపతాపాలన్ని ముందు నశిస్తేనే గాని పరమాత్మ ను సమీపించడానికే మీకు పాత్రత లేదు. అది లేనిదే ప్రార్థనే అసంభవం. ఏమాత్రం నీలో క్రోధమున్నా, ముందు పోయి నీ శత్రువుతో సఖ్యతపడి రావలె; లేదా నీ పాపచింతను అప్పటికప్పుడు పూర్తిగా నాశనం చేసు కొని ప్రార్థనలో దగవలె. అప్పుడే నీ ప్రార్థనలు నీ కేమైనా ఉపయోగపడి, ఉన్నతి నిచ్చేది."

---

## 13

ఒక నాడు జీసను ఒక పరసీయుని యింట్లో భోజనం చేయడం తటస్థించింది. అతడింకా ఆయింటి నుండగానే, ఇరుగుపొరుగు స్త్రీ ఒకతె అక్కడకు వచ్చింది. ఆమె దుర్మార్గురా లని ఆ చుట్టుపట్ల వాడుక.

జీసను ఆయింట్లో నున్నాడని తెలుసుకునే వచ్చింది. రాగానే జీసనుపాదాలపై బడి యేడ్వడం మొదలుపె ట్టింది. కన్నీటి ధారతో జీసనుపాదాలు తడిసినవి. తన పొడుగైన తలవెండ్రుకలతో అతనిపాదాలు శుభ్రంగా తుడిచి, తనతో కూడా తెచ్చిన సీసాలో పన్నీటిని అయున పాదాలపై బోసి చేతులతో కడిగింది. ఇంటియజ మాని ఇదంతా చూచి లోలోపల కొరకొర లాడుతు న్నాడు: "ఇతను నిజంగా మహాత్ముడే అయితే, ఈస్త్రీ అవిశ్వాసి యని, దుర్మార్గురా లని యితనికి తెలిసే వుం డును. తెలిసే వుంటే ఆమెను తనపాదాలు తాకనిస్తా డా?" అని లోలోపల సణుగుకోనడం ప్రారంభించాడు. అంతవరకు జీసను నిశ్శబ్దంగానే కూర్చున్నాడు. పరసీయు నికి కలిగిన సందేహం జీసను కనిపెట్టి, "ఇంతవరకూ నే నేమి ఆలోచిస్తున్నానో చెప్పనా?" అని యింటియజమా నిని అడిగాడు. "ఆ,—చెప్పండ"ని పరసీయుడు జవా బిచ్చాడు. "ఒకానొక భాగ్యవంతుడున్నాడు. వానికి ఒకడు యేబదిపౌనులు, ఇంకొకడు అయిదుపౌనులు బాకీ పడ్డారు. దరిద్రులైపోయి, ఇద్దరూ కూడ అప్పు తీర్చలేక పోయినారు. అప్పుడు ధనికుడు జాలిపడి యిద్దరినీ క్షమించి వదలివేశాడు. ఇప్పుడీయిద్దరిలో యెవడు ధనికుని కెక్కువ కృతజ్ఞుడై వుంటాడో చెప్పగలవా?" అని జీసను ప్రశ్న

వేశాడు. పరసీయుడు బదులు చెప్పినాడు: "చెప్ప దేమున్నది? ఎక్కువ బాకీ వున్నవాడు యెక్కువ కృతజ్ఞడౌతాడు కదా! సందేహ మెందుకు?

అప్పుడు జీసస్ తన పాదాలపై ఒరగియున్న స్త్రీని జూపి పరసీయునితో యిట్లన్నాడు: "నాయనా, చూడవోయి! ఈ స్త్రీ వున్నది,— నీ వున్నావు! నీ వెంతో పుణ్యాత్ముడ వని నీ నమ్మకం. కనుక యిక నీవు చేయవలసిన భగవత్సేవ గాని, ధర్మకార్యాలు గాని లేవనుకుంటావు. తాను అపవిత్రురాలనని, పాపాత్మురాలనని ఈమెకు బాగా తెలుసును. కనుకనే, భగవంతుని ఋణము తీర్చుకోలేకపోతి నని చాలా పశ్చాత్తాప పడుతున్నది. నన్ను నీ యింటికి పిలిచి, కాళ్లు కడుగుకొనుటకు కొంచెము నీళ్లయినా నా కిచ్చినావా నీవు? ఈమెను చూడు! కన్నీళ్లతో పాదాలు కడిగి, తన మృదువైన శిరోజాలతో తుడిచిందే! నీవు నన్ను తాకుటకు కూడ భయపడ్డావు. ఈమె సాష్టాంగపడి ప్రేమపూరితహృదయంతో నా పాదాలనే ముద్దెట్టుకున్నది. ఇక నీవో! నా తల కొక్క నూనెచుక్కైనా యిచ్చి పుణ్యం కట్టుకున్నావా? ఈమె నా కాళ్ళపై పన్నీరు పోసి కడిగింది, నీవే చూచావు కదా! తాను పాపినని తెలుసుకున్నది. పునర్జన్మయెత్తి ప్రేమమయుని దర్శించింది. కనుకనే సరళహృదయంతో అంకురించిన ప్రేమామృతవర్షం

కురిపించగలము. నీవు ధర్మాత్ముడ వని నీలో నీవే అను కుంటావు. కనుక, నీలో ప్రేమనేది లేకుండాపోయి దట్ట మైన తామసం ఆవరించింది. ఎవనిలో పరిశుద్ధమైన ప్రేమ అంకురిస్తుందో వాని అపరాధాలన్నీ భగవంతుడు సహిం చి క్షమిస్తాడు."

---

# 14

ఒక రోజున జీసను 'సమారా' దేశంగుండా పోతూ మార్గాయాసంచేత దారిలో, ఒక నూతియొద్దున కూర్చు న్నాడు. శిష్యులు భోజనపదార్థాలు తెచ్చుటకు పక్క నున్న వూరికి పోయినారు. నీళ్ళు తోడుకొనుటకు ఒకస్త్రీ నూతిదగ్గరకు వచ్చింది. తాగుటకు కొంచెం నీళ్లిమ్మని జీసను ఆమె నడిగినాడు. "అమ్మా, నన్నెట్లా నీళ్లడుగు తావు? మీ యూదులకు మా 'సమారా' వాళ్లతో యే సంబాధం గాని సఖ్యత గాని లేదుకదా! నేనిచ్చే నీళ్ళు నీ కెట్లా పనికివస్తాయి?" అని ప్రశ్నించింది. అప్పుడు జీస సన్నాడు. "నే నెవరినో, నా సందేశ మేమో నీవు గ్రహించి యుంటే నీవీ విధంగా జవాబు చెప్పవు—తప్పక నాకు నీళ్లిచ్చే వుందువు. ఆపైన నేనును అమృతజలాన్ని నీకు కూడ అర్పించే యుందును కదా!" జీసను మాట లామెకు బోధపడలేదు. "నీకు నీ రెక్కడనుంచి వస్తుం

దేమి? మహానుభావుడు, మా 'జేకబు' సంతతి తవ్వించి యి
చ్చిన ఈ నూతినీరు తప్ప మరి నీ కెక్కడ దొరుకుతుం
ది?" అని తిరిగి ప్రశ్నించింది. "అమ్మాయీ! నీ విచ్చే
నీరు యెంత తాగినా దాహం తీరదు. నే నిచ్చే అమృత
జల మెవరు తాగుతారో, వారికందరికీ వెంటనే పూర్ణమై
న తృప్తి కలుగుతుంది. అంతే కాదు—మరొక విశేష
ముంది! ఒకసారి తాగినవాళ్లు తిరిగి దానిని యితరుల
కిచ్చి దానితో అనేకులదాహం తీర్చగలరు". అని జీసస్
చెప్పగా, అతడు మాట్లాడేది ఈ నూతినీరును గురించి
కా దనుకుం దామె. ఏదో ధార్మిక విషయసందర్భంగా అత
డు మాట్లాడుతున్నా డని మాత్రం ఆమె సూచనగా
తెలుసుకున్నది. కాని అంతటితో ఊరుకుండక, "అయి
తే—అయ్యా, నేను 'సమారా' స్త్రీని కదా! మీరు
యూదులు. నీ బోధలు నా కేమి ఉపయోగ మనుకున్నా
వు? మా వాళ్లందరూ ఈ పర్వతంమీదికెక్కి దైవప్రా
ర్థన చేస్తారు. 'జెరుసలేము'లో మాత్రమే భగవంతు డున్నా
డని మీ యూదు లంటారు. ఈస్థితిలో నీ తత్త్వబోధ
నా కెందుకు?" అని స్త్రీ అన్నది. "అవు నమ్మా!—అది
పూర్వచరిత్ర. ఇప్పుడు కాలం మారిపోతున్నది; ధర్మజీవి
తతత్త్వంలో ఒక గొప్పమార్పు కలుగ బోతున్నది. ఇక
ముందు బ్రహ్మసాధకులు జగత్పితను అర్చించడానికి ఏ

కొండమీదికి పో నక్కర లేదు—జెరూసలేమునకును వెళ్ళ నక్కర లేదు. పరమేశ్వరుని ఆరాధనకు స్థలనియమమే లేదు. భగవంతు డాత్మస్వరూపుడు. కనుక ఆయనను ఆత్మద్వారానే దర్శింపవలె. ప్రార్థ ననేది గభీరమైన ఆత్మ కార్యం గనుక, అది పూర్ణాత్మార్పణభావంతో నిండి, కృత్రిమరహితమై వుండవలె. ఆత్మీయదృష్టి, సత్యము—ఇవే యథార్థమైన ప్రార్థనకు పునాది, ప్రాణము. ఇదే నవయుగప్రార్థనాసూత్రం" అని జీసను చెప్పినాడు. అప్పటికిని స్త్రీకి జీసనుమాటలు అర్థం కాక యిట్లా జవా బిచ్చింది: "ఈ లోకానికి దేవదూత యెవరో రాబోతున్నా డని వింటాము. అత డొచ్చినప్పుడే ఈ సంగతులన్నీ బాగా తెలియవలె!" ఆ అవిశ్వాసపు మాట విని చివరకు జీసస న్నాడు: "అమ్మాయీ, నా మాటలు బాగా అర్థం చేసుకోమని కోరుతున్నాను. ఎప్పుడో, యెవరో దిగివస్తా రని, అప్పు డేదో తెలుస్తుం దని, వెర్రి ఆశతో కనిపెట్టుకొని చుక్కలవంక చూస్తూ కూర్చోవడంలో ప్రయోజన మేమీ లేదు. విశ్వాసంతో ఆత్మస్పష్టి కలిగించుకో వమ్మా!" అని చెప్పి వెళ్ళిపోగా.

# 15

జీసను యిట్లా పట్టణాలూ, పల్లెలూ తిరుగుతూ, తనశిష్యులను కూడ కొన్ని చోట్లకు ధర్మప్రచారంనిమిత్తం పంపేవాడు. ఒకనాడు శిష్యులను తనవద్దకు పిలిచి, వాళ్ళు పోయి చేయవలసిన పనినిగూర్చి యిట్లా చెప్పినాడు: "మనుష్యుని జీవిత మెంత పవిత్రమైన ఈశ్వరప్రసాదమో చాలమందికి తెలియదు. అయ్యో, వా రెంత కృపాపాత్రులు! నాకు తెలిసిన సత్యాన్ని వాళ్ళకు నిరూపించడమే నా ముఖ్యమైన జీవితకార్యం. పొలంలో పనిఅంతా భూస్వామి ఒక్కడూ చేసుకోవడం అసాధ్యమే. కనుక తనకు సహాయార్థం కొందరు పనివాళ్లను కూడా నియమించుకుంటాడు. అట్లాగే ఈ భగవత్కార్యంనిమిత్తం నాకు తోడుగా మిమ్మల్ని కూడ పిలుచుకొని వచ్చాను. మీరును పట్టణాలలోనికి పోయి, నా ధర్మసందేశం అన్నిచోట్లవ్యాప్తం చేయండి. ధర్మజీవనంలో పాటించవలసిన నియమాలను అందరికీ తెలియజెప్పండి. ముందు మీ వ్యక్తిజీవితాలలో ఈ నియమాలను పూర్తిగా నెరవేర్చి ఆదర్శప్రాయులు కావలె సుమా!

"తోడేళ్ళగుంపుమధ్యకు గొర్రెలవలె మిమ్మల్ని నేనిప్పుడు పంపుతున్నా నని మీరు మరువగూడదు. మెలుకువలోను, చురుకుదనంలోను తాచుపాములాగునను, పరి

శుద్ధతలో సాధువైన పావురంలాగునను అతిజాగరూకతతో మీరు మెలగవలె. మీ కీపపంచంలో స్వంతసొత్తు అనే దేమాత్రమూ ఉండరాదు. ఏవిధమైన సామానులుగాని, సరుకులుగాని మీవెంట తీసుకొని పోగూడదు. మీపెట్టెలు సంచులు మొదలైన వేవీ మీతో నుండగూడదు. కట్టుబట్టలతో పోవలసినదే గాని, సీనుబండములుగాని, డబ్బుగాని నిలువజేసి మీతో నుంచుకోగూడదు. ఈ పప్రంచంలో మనిషికీ మనిషికీ మధ్యనున్న కృత్రిమభేదాలను మీ రేమాత్రం గణింపనేరాదు. ఏ యింట్లో బసచేదామా అని, ఇల్లిల్లు తిరిగి మంచిచోటుకొరకు దేవులాడుట మీపని కాదు. ఒక్కొక్క గ్రామం ప్రవేశించగానే, మీకు మొదట కనబడే యింటికే పొండి. గుమ్మంలోపలికి పోయి, గృహస్థులను ప్రేమభావంతో పలకరించి, వారాదరించి రమ్మంటే లోపలికి వెళ్లండి. వద్దంటే బదులుచెప్పకుండ మరొక యింటికి పొండి—తెలిసిందా? మీ వుపదేశాలు విని కొందరు మిమ్ము అసహ్యించుకోవచ్చు. దౌర్జన్యంగా కొందరు మిమ్ము ఎదుర్కొనవచ్చు; ఊరూర మిమ్ము తరిమి తరిమి కూడ కొట్టవచ్చు. ఏమైనా గాని య్యుండి, మీరు ధైర్యంమాత్రం విడువకూడదు. ఊరు నుంచి బలవంతంగా వెళ్లగొడితే, మాట్లాడక మరొక వూరు పోవలసిందే గాని మీ రేమీ ప్రతీకారం చేయరాదు.

తోడేళ్లు గొఱ్ఱెలను వేటాడినట్లు, తరిమికొట్టి మిమ్ము పట్టుకొని అధికారులవద్దకును రచ్చలకును యీడ్చుకొని పోతారు. అధికారులయెదుట సమాధాన మేమి చెప్పాదు మా అని మీరు దీర్ఘాలోచనలు చేయ బనిలేదు. పరమేశ్వరుడే అంతరాత్మ స్వరూపంగా మీ ప్రతివాక్యనిలో నూ నిర్నిద్రుడై వున్నాడనే దృఢవిశ్వాసంతో వుండండి- అంతే! దండనాధికారుల కొలువులో యేమేమి చెప్పాల అవసరమో, అవసర మైనప్పుడు సత్యమూర్తి యైన భగవానుడే చెప్పుతాడు—ఆ తొట్రుపాటంతా మీ కేల? భారం మాయనపై నుంచి నిశ్చలవిశ్వాసంతో, ప్రవర్తించడమే మీపని.

"మనుష్యులెందరో—మీ తోడసోదరులే—మిమ్ము ధ్వంసం చేయుట కొడిగట్టుకుంటారనే నమ్మండి. కాని వాళ్లకు మీ రేమాత్రం భయపడ వలదు. ఎందుకంటే, మీ నిజస్వరూపాలను, మీ ఆత్మలను వారు ముట్టనైనా లేరు. కాని నిజంగా మీరు భయ మొందవలసిన విషయ మొక్కటున్నది. మీ అవిశ్వాసంద్వారా, మీ పాపపు చింతలద్వారా, శరీరాలతోపాటు మీ ఆత్మలను గూడ ధ్వంసం చేసుకునే దురవస్థకు మీ రెంతైనా భయపడవలసినదే! దీనినిగూర్చిన పరితాపంతో మీగుండెలు బద్దలు కొట్టుకోవద్దు! జాగ్రత! జాగ్రత!

"విశ్వేశ్వరుని ఆజ్ఞ కానిదే చిన్నపక్షికూడ చిన్న పురుగైనా సరే నశించదు. ఆయనయిచ్ఛ లేనిదే తలలో వెంట్రుకైనా కదలదు. మీరాయనఅధీనంలో, రక్షణలో నున్నప్పుడు మీ కిక భయ మెందుకు!"

---

## 16

జీసస తనశిష్యులను కొందరి నొకవైపుకు బంపి మరికొందరిని తనవెంట బెట్టుకొని చిన్నచిన్న పల్లెలవెంబడి, మరొకవైపుకు, తాను ప్రయాణ మైనాడు. ఇట్లా ఒకపల్లెలో పోతూవుండగా, ఒక యిల్లాలు తనయింటికి దయచేయ మని జీసస నాహ్వానించింది. ఆమె పేరు 'మార్తా' జీసస లోపలికిపోయి కూర్చుని మాట్లాడుతున్నాడు. మార్తా చెల్లెలు 'మేరీ' వచ్చి జీసస కాళ్లవద్ద కూర్చుని శ్రద్ధాభక్తులతో ఆయనమాటలు వింటున్నది. వంటపని చేసుకొనుటకు మార్తా యింట్లోకి పోయింది. కాని యింట్లోపని అంతా తనమీద పడినదని మార్తాకు కొంతకష్టం తోచింది. పని అంతా తనకు వదలిపెట్టి మేరీ పోయి జీససుతో సుఖంగా కబుర్లు చెపుతూ కూర్చోవడం సహించ లేకపోయింది. ఇంట్లోనుంచి బయటకు వచ్చి జీససుతో "అయ్యా, చూచినారా? నే నొక్కదాననూ పనిఅంతా చేసుకోవలె; మా చెల్లెలు వచ్చి మీవద్ద కూర్చుని మాట

లతో కాలక్షేపం చేస్తున్నది. లోపలికి వచ్చి కొంత పని లో తోడ్పడ మని చెప్పండి!" అన్నది. జీసను చిరునవ్వు నవ్వి జవాబిచ్చాడు: "మార్తా! నీ వెన్నోపనులు నెత్తి మీద వేసుకొని తాపత్రియంలో మునిగియున్నావు. కాని జీవితానికి కావలసిన దొక్కటే వస్తువు సుమా! ఏదైతే నిజంగా అవసరమో దానినే మేరీ కోరుకొన్నది. అది నీకు తెలియక, ఆమె కాలం వృథాపుచ్చుతున్న దనుకు న్నావు. ఆమె సంపాదించే సొత్తు అపహరించడాని కెవ్వ రికీ శక్యం కాదు. బ్రతుకు సార్థకం కావలెనంటే, శరీరా నికి గాదు అంతగా పోషణ కావలసినది,—ఆత్మకు."

ఈసత్యాన్నే జీసను ఒకకథగా చెప్పినాడు. "ఒక ష్రా వొకనికి పంట బాగా పండింది. అత డనుకున్నాడు; 'గాదులన్నీ తిరిగి గట్టిగా మరమ్మతు చేయించవలె. కొత్త వికూడ కొన్ని కట్టించవలసి వుంటుంది. ధాన్యమంతా జాగ్రత్తపెట్టి గాదులలో నింపవలె. అప్పుడు కదా, నాకు నిజమైన సంతృప్తి, కావలసినంత భాగ్యం, భోగం, ఆత్మ శాంతి!' కాని ఈతని నిర్భాగ్యత చూచి ,ఓయిమందభా గ్యుడా! ఈరాత్రి నీయాత్మ నిన్ను విడిచి పోతున్న దని నీకు తెలియదు కాబోలు! నీ విన్నాళ్లనుంచి కూడబెట్టిన ధనధాన్యాలు యితరులపాలై పోతున్నవి చూడు!' అని భగవంతుడు గట్టిగా హుంకరించాడు.

"కేవలం శరీరసుఖం కోరకే బ్రతుకనుకొని ఆత్మను మరచిపోయే ప్రతిజీవియొక్క అవస్థయు ఇంతే!

"ఎవడు తనయిచ్ఛను పూర్తిగా భగవదధీనం చేసి బ్రతుక నిశ్చయిస్తాడో వానిదే ఉత్తమమైన స్వర్గీయసంపద. శరీరసుఖం కోరకే పడరాని పాట్లన్నీ పడుతూ సంసారజంఝూటంలోనే బ్రతుకు సమాప్తి చేసుకొనేవాడు మితిలేని నష్టం పొందుతాడు"

---

# 17.

'పైలేటు' అనే ఒక రాజకీయోద్యోగి కొందరు 'గలీలీ' నివాసులను చంపినాడని; మరెక్కడో గోపురమొకటి కూలిపోయి పద్దెనిమిదిమంది మనుష్యులు దానికింద బడి చనిపోయినారని జీసను విన్నాడు. "ఇట్టిసంఘటనలను బ్రహ్మయోగుడు జేదృష్టితో చూడవలె" నని జీసను అక్కడున్నవారిని ప్రశ్నించి "ఈ చనిపోయిన మనుష్యులు కోరుకొని యేదైనా అపరాధం చేస్తేనే ఈ చావు కలిగిందంటారా మీరు? కాదు కాదు! ఇక్కడ నున్న మనకంటె వాళ్లేమాత్రమూ యెక్కువ దుర్మార్గులు కారు. వాళ్లిప్పు డున్నస్థితికి మనమందరమూ కూడ యేదో ఒక క్షణంలో పోవలసినదే. నేడో రేపో అందరమూ చనిపోతాము. మృత్యువు నెవరు తప్పించుకో గలరు?

కనుక ; నాశనమయ్యే శరీరాన్ని అంతగా పువ్వులలో పెట్టి దాచుకోవాలని కోరుకోనకండి. అది ఎప్పుడో పోకతప్పదు. అనంతమైనది, చావులేనిది—ఆత్మజీవనమే. దాని కొరకే మన సర్వస్వం అర్పించగలుగుననే విశ్వాసంతో నిలువగలిగితేనే మృత్యుంజయుల మౌతాము."

ఈ సత్యాన్ని గూర్చి జీసస్ ఒక కథ చెప్పి నిదర్శన మిచ్చాడు.

"ఒకని తోటలో ఒక రేగుచెట్టున్నది. అది ఎన్నాళ్ళకూ కాయలు కాచేది కాదు. యజమాని తన తోటమాలినిపిలిచి 'మూడేళ్ళనుంచి చూస్తున్నాము. ఈ చెట్టున ఒక్క పండైనా పండలేదు. ఇది వృథాగా చాల స్థలం కూడ ఆక్రమిస్తున్నది. దీనివలన యింక ప్రయోజనం లేదు. గొడ్డలి తెచ్చి, వెంటనే నరికివేయు' మన్నాడు. 'అయ్యా! తొందరపడక మరికొంత కాలం చూడండి. చుట్టూ వరవచేసి, ఎరువు వేసి నీరు పెట్టి చూదాము. వచ్చే ఋతుసమయంలో బహుశః కాయవచ్చు. అప్పటికీ కాయకపోతే, కొట్టివేయవచ్చు' నన్నాడు తోటమాలి.

"మన విషయంకూడ అంతే! ఈ రేగుచెట్టువలెనే శరీరంకొరకే స్వార్థంగా బ్రతుకుతూ అణుమాత్రమైనా ఆత్మఫలం చూపలేని మనుష్యులనుకూడ దయానిధియైన భగవంతుడు వెంటనే నాశనం చేయడు. ఈ రేగుచెట్టు

ఈ శుష్కజీవితాలు యింకా చిగురించు నేమో యెప్పటి కైన కాయలు కాచి ఫలించు నేమో, జీవితసిద్ధి పొందుత వేమో నని ఆశపడుతూ వుంటాడు. కాని మన మెప్పటికీ పనికిరాకపోతే వినాశమే వచ్చే ప్రతిఫలం. ఈ నిజం తెలుసుకోడానికి పెద్ద చదువులూ, పాండిత్యాలూ అక్కరలేదు. ఆత్మబుద్ధిని నిలిపి చూస్తే ప్రతివానికీ తనలో తనకే తెలిసిపోతుంది. చూడవలె నని సంక ల్పమే వుంటే, సులభంగా కనబడుతుంది. గృహవిష యాలలో మాత్రమే గాకుండ, యావత్తు ప్రపంచవ్యవ హారాలనుగూర్చి గూడ మనం తర్కవితర్కాలు చేసిచేసి, 'అది అట్లాగు, ఇది ఇట్లాగు' అనీ ఎక్కడేమి జరుగుతు న్నదో, యేమి జరుగబోతుందో ఊహించి అంచనాలు వేస్తుంటాము గదా! పడమటిగాలి వీచగానే, అదిగో వర్ష కాలం వస్తున్నదనీ, దక్షిణపుగాలైతే ఇక చాలహాయిగా వుండబోతుందనీ అతిశ్రితతో చెప్పకుంటాము. ఇన్నివిష యాలలో ఆమూలాగ్రంగా అంతా తెలిసినట్లు ఊహలు పెంచగలిగే వాళ్లమే! ఇంతకంటె స్థిరమై, నిస్సంశయ మైన విషయం—మనమందరమూ యెప్పుడో చచ్చుట తప్పదని జ్ఞప్తియం దుంచుకో లేమెందుకు? మన మానస ప్రాణులతో సంరక్షించుకోవలసిన పరమార్థం, మృతిలేని ఆత్మజీవనమే కాని, శరీరం కాదు సుమా!' అనే విషయా న్నే మరచిపోతాము. ఏమి వింత!"

# 18

ఆత్మజ్ఞానమే పరమధన మనుకొని, తద్వారా జీవాత్మయొక్క అభివృద్ధిమార్గం కనుగొనవలె నని బోధించుటకు జీసను ఈకిందికథ చెప్పినాడు. "ఒకధనికు డున్నాడు. ఒకప్పుడు తాను దేశాంతరం పోవలసి వచ్చింది. ప్రయాణమై పోయేముందు తన నౌకరుల నందరిని చేర బిలిచాడు. పదిపౌనులు తెచ్చి ఒక్కొక్కని కొకపౌను చొప్పున వచ్చిన పదిమందికీ పంచియిచ్చి 'నేను మీ కిచ్చే డబ్బుతో పని చేసుకొని బ్రతుక'మని చెప్పి పోయినాడు. అతడు పోయిన వెంటనే నౌకరులు తమయిష్టం వచ్చినట్లు విచ్చలవిడిగా తిరగడం మొదలుపెట్టినారు. యజమాని కొన్నాళ్లకు తిరిగియింటికి వచ్చాడు. ప్రతివానిని పిలిచి తా నిచ్చిన డబ్బు యెట్లా వినియోగపరచా వని అడిగినాడు. మొదటివాడు 'బాబూ! మీ రిచ్చినపౌనుతో నేను పదిపౌనులు సంపాదించినాన'ని చెప్పినాడు. 'ఓహో! బాగున్నది! మంచి సేవకుడవు! ఇంత చిన్నవిషయంలో గూడ నీవు చాల జాగ్రత్తగా, విశ్వాసంతో నడుచుకున్నావు. నీ కింకా గౌరవార్థంగా అనేకపనులు అప్పగిస్తాను లే! ఈదినం మొదలు నీవు నాతో సమానుడ వైనావు. మన యిద్దరిలో యిక భేదభావ మేమీ లేదు; నా సుఖసంపదలలో భాగస్వామి వైనావు.' అని చెప్పి చాల మెచ్చుకున్నాడు.

"రెండవవానిని తన కియ్యబడ్డ పౌనుతో ఐదుపౌనులు సంపాదించినా నని యజమానితో చెప్పినాడు. 'నీవూ మెచ్చుకో దగినవాడవే! నీవు కూడ నాతో సరిసమానంగా, గౌరవచిహ్నంగా, నా భోగభాగ్యాలు అనుభవించు' మన్నాడు యజమాని.

"మూడవవానిని ముందుకు వచ్చి 'స్వామీ, ఇదిగోనండీ మీ రిచ్చినపౌను! మూటగట్టి జాగ్రత్తగా దాచి వుంచాను. మిమ్ము నే నెరుగనా? మీది చాల కఠినస్వభావం. నా కిచ్చినడబ్బు ఖర్చు చేసేస్తే కోప మొచ్చి నన్ను దండిస్తారనే భయంచేత నేను దానిని తాకనే లేదండీ' అని జవా బిచ్చాడు. 'ఓరి దుర్మార్గుడా! నీవు తప్పక దండనార్హుడవు. ఏ వుద్దేశంతో నీకు నేను డబ్బిచ్చినానో అదే నీవు నెరవేర్చలేక పోయినావు. కనుక అది నీవద్ద నుండనే తగదు'అని చెపుతూ, వానిదగ్గరనున్న పౌను కూడా తీసుకొని," తన వుద్దేశాన్ని నెరవేర్చి బాగా పనిచేసిన వాళ్లకే దానిని కూడ పంచిపెట్టమని యజమాని తన సేవకులకు ఆజ్ఞ యిచ్చాడు. అప్పుడు సేవకు లన్నారు: 'అయ్యా, పని చేసిన వాళ్లవద్ద యిప్పటికే కావలసినంత డబ్బున్నది; ఇది కూడ వాళ్ళకే యియ్యడ మెందుకండి?' 'అవును, అట్లాగ యియ్యవలె. ఎవరు తమ యజమాని వుద్దేశం తెలుకొని, తమ కిచ్చినదానిని సద్వినియోగం చేస్తారో, వాళ్లె

యింకా యెక్కువలాభం పొందడానికి తగివుంటారు. అట్లు గాక ఎవరు తెలివిహీనతచేత అట్టి ఉపయోగాన్ని యెరుగరో వాళ్లకున్నది కూడ ఉంచుకోడానికి తగరని యజమాని జవాబు చెప్పినాడు.

"ఇట్లాగే మనుష్యుడు తన జీవితాన్ని ఏవిధంగా ఉపయోగపరచవలె ననేదే పెద్ద సమస్య. పైకథలోని భాగ్యవంతుడే పరమేశ్వరుడు. సేవకులే మానవకోటి. ధనికుడు పంచిపెట్టిన ధనమే మనుష్యునిలోపలి అంతరాత్మ. తమ కప్పజెప్పిన వస్తువును వినియోగపరచమని బానిసలకు యజమాని డబ్బిచ్చినట్లే, పరమేశ్వరుడు ప్రతిమనుష్యునికీ అంతరాత్మనే పరమధనంగా ప్రసాదించాడు. దాని నిజమైన ఉపయోగం తెలుసుకొని దానినే మనలో అనంతంగా అభివృద్ధి చేసుకోవలె. ఈశ్వరేచ్ఛను శ్రద్ధాభక్తులతో నెరవేర్చుటకే ఆత్మజీవన మియ్యబడ్డదని జ్ఞానులు మాత్రమే తెలుకోగలరు. ఆత్మాభివృద్ధికే వారి నిరంతర కృషి. పవిత్రజీవనమే తమ జన్మహక్కుగా అనుభవింపగలుగుతారు. కథలోని మూడవబానిసవంటి మందభాగ్యులు శరీరసౌఖ్యం పోతుందని భయపడి, స్వేచ్ఛాచార్యులై శాశ్వతసుఖానికి దూరమౌతారు.

"విలువైన వస్తువులలోకెల్ల విలువైన దానినే పోగొట్టుకొని వళిస్తారు. శరీరసుఖాన్ని మించిన జవితం లేదని

చెప్పి, ఆత్మనే మరచిపోయే దానికంటె ఎక్కువ పరిహా దకరమైన కృతఘ్నత మరొకటేది? ఆంతరంగిక జీవితసూత్రంతో యెప్పటికప్పుడు ఐక్యతపొందుతూ, వట్టి శరీరాన్నిగాక అంతశ్శక్తినే సేవిస్తూ బ్రతుకవలె. ఈ ఐక్యతనే నిరంతరం భావిస్తూ అందులో నిలువనివాడు దానికి శత్రుపక్షంవాడే కాని ఆత్మజీవనం యొక్క పక్షపాతి కానేరడు."

# 19

ఒకరోజున కొందరు చిన్నపిల్లలు వచ్చి విలాసార్థంగా జీసనువద్ద నిలబడ్డారు జీసనుశిష్యులు వాళ్లను పొమ్మని గెంటివేయడం మొదలుపెట్టినారు. అదంతా చూస్తూనే వున్నాడు జీసను. "పిల్లలనుమాత్రం మీరు గెంటవద్దయ్యా! చిన్నిబాలురను గెంటి పంపివేసేదా మీ బుద్ధికుశలత? వయోవృద్ధు లెందుకు?—పసిపిల్లలదే స్వర్గరాజ్యంతో సామీప్యస బంధం. వాళ్ల మాయలేని తనమే, వారి పవిత్రమృదుస్వభావమే మనకెన్నో సదుపదేశాలు చేయగలదు. చిన్నపిల్లల నోటికి దుర్భాషలు రావు. వాళ్లలో అసూయొకటి లేదు, వ్యభిచారపాతకం లేదు. పసిపిల్లలెప్పుడూ అహంకారపు ఒట్లు పెట్టుకోరు, కోర్టులకెక్కి ఎవరిమీదనూ పగసాధించరు. స్వజాతి విజాతి

భేదాలు వాళ్లకు తెలియనే తెలియవు. అందుకే వాళ్లకూ భగవంతునికీ అంత దగ్గరసంబంధం. అటువంటి అమాయకులను దగ్గరకు రాకుండా తరిమివేయడం గాదు మన గొప్ప! మన వెర్రిమొర్రి సంకుచిత అభిప్రాయాలతో, వాళ్లను గూడ మలినపరచి ప్రలోభనంలోనికి దింపకుంటే చాలు! చిన్నపిల్లలదే స్వర్గరాజ్యం. వయోవృద్ధు లెందుకేమి?

"ప్రలోభసంకటంకంటె భయంకరవస్తు వేమున్నది? మంచిమాటలతో మనుష్యులను మోసపుచ్చి దుర్మార్గంలోనికి దింపి ధ్వంసం చేస్తుంది. ప్రలోభనానికి కాస్త సందిచ్చామా, శరీరమూ ఆత్మకూడా నాశనం కావలసిందే! ప్రలోభనంలో పడిపోయేకంటె, ఎంతైనా సరే శరీర వేదన కల్పించుకొని బయటపడడమే మన విధి. కాలు బోనులో చిక్కించుకొన్న నక్క, కాలు ముక్కలైనా చేసుకొని ప్రాణం దక్కించుకొని యెట్లా పారిపోతుందో, అట్లాగే ధీరమతులు కఠోరఆత్మసాధన జేసి, శరీరాన్ని బాధవేదనలతో ముంచి, తృణప్రాయంగా విసరివేస్తారే గాని, ప్రలోభనానికి మాత్రం లొంగరు. కాలు, చేయి, కన్ను, చెవి, చివరకు శరీరమంతా నాశనమైనా మంచిదే కాని ప్రలోభనానికి మాత్రం దాస్యం కూడనిది—అనరానిది, వినరానిది! ప్రపంచంలో లెక్క

లేకుండా నిండివున్న, దరిలేని దుఃఖవాహినులకు ప్రలోభ
నమే ఉత్పత్తిస్థానం. ప్రలోభనంద్వారానే దుష్టత్వమీ
ప్రపంచంలో ప్రవేశించింది.

---

## 20

ప్రలోభనాలలోకెల్ల క్రోధమే చాల ఘోరమైనది,
బహుజాగ్రత! అని జీసస్ బోధించాడు. "ఒకడు తనసో
దరుడు తప్పుచేశాడని వానిమీద ఆగ్రహపడతాడు. క్రో
ధాగ్నిని కురిపించి పాపియొక్క జీవితాన్ని బాగుచేయగల
నని అతని వుద్దేశం. మన మందరమూ కూడ పాపానికి
చేరువనే వున్నామని; ఇతరులను సంస్కరింప బూనుటకు
ముందు మనమే ఆత్మపరీక్షలో తేరవలసివున్నామని; ఆత్మ
దృష్టి యేమీలేక యితరులను విమర్శించుట సాహసమని
వాళ్ళకు తెలియదు. అందుకే ఎదుటివాని కంట్లో (జీవితం
లో) నలుసునైన కష్టపడి పట్టి చూపడానికి అహంకారం
తో ముందంజవేస్తాము. కాని నల్లని పాపపుమచ్చలతో
నిండినకండ్లనుమనవద్దనుంచుకొనేచూస్తున్నామనిమాత్రం
తెల్సుకోలేము. కనుక నీవు చేయవలసిన దేమి? ఒకడు తప్పు
చేశాడని నీకు తోచినప్పుడు, దాని కొరకు ప్రత్యేకసమయ
మూ చోటూ చూచి, ఒంటరిగా అతనిని కలుసుకొని, నీ
కున్నకష్టమంతా నెమ్మదిగా చెప్పవలె. నీమాటను సహిం

చి, సానుభూతితో వింటాడా, నీతో శతృత్వం మరచి నీ
కాప్తు చూ తాడు; తన నడవడి కూడ దిద్దుకుంటాడు. వినక
పోతాడా, నీవేమి చేయగలవు? అతని హితానికే విడిచి, మం
చివాడుగావలెనని భగవంతునిగూర్చి ప్రార్థించు."

అప్పుడొక శిష్యుడు జీససును ప్రశ్నించాడు: "నేను
చెప్పినమాట వినకపోవడమే కాక, వాడ దేపనిగా నన్ను
దూషిస్తే చేయవలసిన దేమండీ?—తిరిగి వానిని క్షమిం
చవలసిందేనా? మూడుసార్లు, నాలుగుసార్లు—ఏడుసార్లు
నన్ను బాధించడం మొదలుపెడితే, యేడవసారికూడ క్ష
మించి పంపవలసిందేనా?" "ఏడుసార్లుకాదు,—పదియేళ్ళు
డెబ్బదిసార్లుకూడ సందేహం లేకుండా క్షమించవలసినదే.
మనం పశ్చాత్తప్తులం కాగానే, అపారప్రేమతో జగత్ప్ర
భువు భగవంతుడే మన పాపాలు కోట్లానకోట్లు క్షమిస్తు
న్నాడు. అదిచూచి మనంకూడా మనదోషులను క్షమిం
చడం నేర్చుకోవలె. తద్వారా, క్షమింపబడినవాడు క్షమిం
చినవాడు, ఉభయులూ ధన్యులౌతారు.

---

# 21

ఇతరులయెడల మనంచూపవలసిన క్షమాగుణాన్ని
గూర్చి జీసస్ ఒకకథ చెప్పినాడు. "ఒక ధనికుడు తనకు
రావలసిన బాకీలను వసూలు చేసుకుంటున్నాడు. వేయి

పౌనులు బాకీపడిన వాడొకడు ఋణదాతవద్దకు వచ్చాడు. అప్పుతీర్చడానికి వానివద్ద ఒక్కాగవ్వైనా లేక పోయింది. ధనికుడు తలుచుకుంటేమాత్రం, ఆఋణగ్రస్థునీ, వానిఆస్తినీ భార్యనూ, బిడ్డలనూ కూడ అమ్మించి తనడబ్బు రాబట్టు కోవచ్చు. కాని బీదవాడు క్షమించవలసిందని మరీమరీ వేడుకున్నాడు. ధనికుడు జాలిపడి, ఏమీ యియ్యనక్కర లేదని చెప్పి, విడిచిపెట్టి వెళ్లిపొమ్మన్నాడు. ఈక్షమింప బడ్డ వానికే మరొకడు కొంతబాకీవున్నాడు. అతడుకూడా వీనివద్దకువచ్చి 'అయ్యా, దరిద్రుడను; బాకీ తీర్చలేను క్ష మించవలసింద'ని చాలాప్రార్థించాడే కాని ఈఋణదాత హృదయంలో దాక్షిణ్యమే లేకపోయింది. పైసలతో సహా తక్షణం చెల్లించమని నిర్బంధించాడు. బీదవాడెన్నిసార్లు వేడుకున్నా వీనికి కనికరంపుట్టలేదు. శిక్షవేయించి వానిని జైలులో పెట్టించాడు. ఈ అన్యాయం గ్రామస్థులందరూ చూచి దయను జూపిన మొదటిధనికుని వద్దకు వచ్చారు. 'నీవు జాలిపడి ఆదుర్మార్గుని క్షమించి పంపినావే కాని, తనకు బాకీపడిన పేదవానిని తానుకూడా క్షమించవలె నన్నే బుద్ధివానికి లేకపోయింది'ని చెప్పినారు. అది విని స హింపలేక, ధనికుడు తిరిగి వానిని పిలిపించి 'ఓరి దుర్మార్గు డా, నిన్ను నేను క్షమించి పంపలేదా? అట్లాగే మరొకనిని నీవు మాత్రం క్షమించవద్దా? కాని నీవేమి చేశావో చూ

చుకో!" అని చెప్పి వానికున్న ఆ స్థితి అంతా అమ్మించి బాకీడబ్బు పూర్తిగా రాబట్టుకున్నాడు.

"మన కపచారం చేసేవాళ్లను గూడ మనసార క్షమించి సంపకపోతే, మనగతి గూడ అట్లాగే అవుతుంది. తోడివాళ్లపట్ల మనం కల్పించుకునే శత్రుత్వాలు, కలహాలు—ఇవే మనకు తెగని సంకెళ్లై మనను ధర్మానికి దూరంచేస్తాయి. స్వామిద్రోహులము కాకుండవలెనంటే, ఇరుగుపొరుగులపట్ల మొదట ఓర్మిని, ప్రేమను చూపి వారితో సంపూర్ణ ఐక్యత సాధించడమే తగు ఉపాయం."

---

## 22

ఒక రోజున కొందరు పరిసయ్యులు యేసునొద్దకు వచ్చి "ఒకడు తన భార్యను విడిచి మరొక స్త్రీని పెండ్లాడవచ్చునా?" అని ప్రశ్నించారు.

యేసు ఇట్లా చెప్పినాడు! "పురుషునకు ఒకే భార్య, స్త్రీకి ఒకే భర్త వుండవలెనని మీకు తెలియదా ఏమి? అది భగవంతుని సంకల్పం,— సృష్టినియమం కూడాను. ఆ నియమాన్ని మనుష్యుడుల్లంఘించి తన మనుష్యత్వాన్నే పోగొట్టుకుంటాడు. అటువంటి మూర్ఖుడే సృష్టినియమాన్ని దాటి భార్యను వదలిపెట్టి, మరొకతెను కట్టుకొని, మూడు విధాల పాపం—ఒకటి, తనకు తాను; రెండు, భార్యయెడ

ల, మూడు, ప్రపంచంయెడల—చేస్తాడు. చివరకుధ్వంసం చేసి స్వేచ్ఛావర్తనాని కలవాటుపడతాడు. కనుక ఆత్మ హత్యాదోష మాపాదిస్తుంది. భార్యను విడిచి, ఆమెకు గూడ పాపపంకిలంలోనికి దారి జూపిన పాతకం గట్టుకుంటాడు. ఒకవైపున ఆమెజీవితాన్ని దగ్ధంచేసి, తన వ్యభిచారంద్వారా యితరులను గూడ ప్రలోభనంలోనికి దింపి లోకహాని కలిగిస్తాడు."

అప్పుడు జీసనుశిష్యులలో కొందరులేచి "అయ్యా ఒక్కభార్యతో తృప్తిజెంది బ్రతకట మెంతకష్టం! బ్రతికి నన్నాళ్ళూ ఒక్కస్త్రీతో నుండవలసిన అవస్థకంటే, పెండ్లే లేకుంటే చాలా మంచిదికాదా!" అని అడిగినారు.

జీసను వాళ్ళకు ప్రత్యుత్తరమిచ్చాడు: "పెండ్లిమానినా మానవచ్చు. అచంచలదీక్షతో బ్రహ్మచర్యవ్రతం జరిపి, స్త్రీతలపే మనసుకు రాకుండ పవిత్రజీవనం గడపవలె! అట్లా చేస్తే బ్రహ్మచర్యం ఉత్తమమే. అది లేనప్పుడు పెండ్లాడి, ఏకపత్నీవ్రతం జరిపి, పరస్త్రీతలంపు లేకుండ బ్రతకడం మంచిది."

## 23

ఒకనాడు పన్నులు వసూలుచేసే ఉద్యోగివొకడు పీటరువద్దకువచ్చి "మీగురువు పన్నులుచెల్లిస్తాడా?" అని

అడిగాడు. పీటరు జీససుయొక్క ముఖ్యశిష్యులలో ఒకడు. "చెల్లించకేమి! చెల్లిస్తాడ"ని పీటరు జవాబిచ్చాడు.. ఆ జవాబు జీసను విని పీటరు నడిగాడు; "మిత్రుడా! నీవేమనుకుంటావు? రాజు పన్నులు పుచ్చుకునేది, తన బిడ్డలవద్దనా లేకపరులవద్దనా?" "ప్రజలు తన బిడ్డలనుకుంటే వాళ్ళవద్ద పన్నులెందుకు పుచ్చుకుంటాడు? వాళ్లు పరు లనుకుంటేనే తనవాళ్ళు కాదనుకుంటేనే—తీసుకుంటాడ"ని పీట రన్నాడు. "కనుక, మనం భగవంతుని బిడ్డలమైతే, ఈపన్నులన్నీ మనం రాజు కియ్యవలసిన పనేలేదు. కాని ప్రలోభనాల కవకాశమిచ్చి వాళ్ళకు పాపానికి మార్గం చూపడంకంటె, పన్నిచ్చి వేయడమే మంచిద"ని జీసస చెప్పినాడు.

మరొకనాడు కొందరు పరిసీయులు కొందరు హెరోదుద్రోగులతో కలిసి జీససువద్దకు వచ్చారు. రాజుకు చెందవలసిన పన్ను అతడిస్తాడో, ఇయ్యడో చూదామని వచ్చారు. ఏవో యుక్తిప్రశ్నలలో జీససును పడగొట్టి, అతని మాటలు అతనిచేతనే కాదనిపించి, ఆపైన గెలిచేదామనే దురుద్దేశంతో వచ్చారు. రాగానే జీసను నొకప్రశ్న అడిగారు: "నీవెప్పుడూ, పక్షపాతంలేకుండా, సత్యమూ న్యాయమే చెపుతావని మావిశ్వాసం.—అయితే, రాజుకు పన్ను కట్టవలెనా, అక్కరలేదనా నీసమ్మతం?" వాళ్ళ దురుద్దేశంతో ఈప్రశ్న నడిగారో జీససుకనిపెట్టి "అయ్యా! ఏమి మీ

కృతిమబుద్ధి! ఎంత మోసము నెంతమర్యాదతో కప్పిపుచ్చుతున్నారు!" అనినిట్టూర్పువిడిచాడు. "మీరుసర్కారుపన్ను ఏరూపకంగా చెల్లిస్తార" ని వారి నడిగాడు. ఆ దేశపు నాణె మొకటి తెచ్చి చూపించారు. దానిమీద రాజుబొమ్మ ముద్రించి వున్నది. జీసను ఆబొమ్మ మీద వేలు పెట్టి చూపిస్తూ "రాజు వస్తువులేవో రాజుకే యిచ్చివేయండి. భగవంతుని వస్తువులు మాత్రం, అనగా మీ జీవితాలు, భగవంతునికే గాని మరెవ్వరికీ యిచ్చివేయరాదు. మీ ధనం, యిల్లు, వాకీలి, ఒకటేమిటి! మీ కున్నసమస్తం— ఏది యెవరడిగితే వారి కిచ్చివేయండి. కాని భగవంతుని కిష్టంలేని పని ఎవ రడిగినా, ఎవరు చేయమన్నా, ఏమి సంభవించినా సరే చేయరాదు."

# 24

ఒక రోజున జీసనూ, శిష్యులుకొందరూ ఒక పల్లెటూరికి చేరి, ఆరాత్రి అక్కడ బసచేయడానికి చోటిమ్మని గ్రామస్థుల నడిగారు. కాని యెవ్వరూ చోటియ్య లేదు. వెంటనే శిష్యులందరూ క్రోధావేశంతో జీసనువద్దకు వచ్చి జరిగిన వృత్తాంతం అతనికి వినిపించి "అబ్బబ్బా! ఆ గ్రామంలో మనుష్యులెంత దుర్మార్గు లండీ! కాస్త చోటడిగితే యిచ్చారు కారే! ఏమి కౄరత్వం! ఏ పెద్దగాలి

వానో పట్టి, భగవంతుని దయవల్ల పూరంతా ధ్వంస మై
పోతే బాగుండును! అయ్యా, భగవంతు డీపూరిమీద
పెద్ద అగ్నివర్షం కురిపించి భస్మం చేస్తాడని శాపమిచ్చి
పోదామా యేమి?" అన్నారు. ఈ మాటలు చెవిని బడ
గానే జీససు హృదయావేదన పొంది "మీరు ఏ పవిత్ర
మైన ఆత్మనుండి ఉత్పన్న మైనారో మీ కింకా బోధపడనే
లేదే! ఇప్పటి కింకా మీలో యెంత కట్టుపడిన తామస
మున్నది! శపించి ప్రపంచాన్ని ధ్వంసంచేయ మని కాదు
నా సందేశం. కోటి మానవులు నాశన మైపోవాలని మన
మెట్లా కోరుకోగల మయ్యా—చెప్పండి! లోకకల్యాణం
కొరకే గాని, ధ్వంసంకొరకు గాదు—మానవ బతుకు దేరి
నది. మీలోనున్న ఆత్మజ్యోతి ప్రతిహృదయంలో మా
త్రం లేదా? కనుక వాళ్ళు ధ్వంస మైపోవాలని కోరుకో
వడ మంటే, మీలోనున్న ఆత్మజ్యోతియే ఆరిపోవలె నని
కోరు కొనడమే కదా! ఇది మాత్రం మహాపాతకం!"
అని జీససు వారిని తీవ్రంగా మందలించాడు.

మరొకప్పుడు కొందరు పరసేయులు, మరికొందరు
ఛాందసులైన పండితులు ఒకస్త్రీని ఒక పాపగృహంలో
పట్టుకొని తీసుకొని వచ్చారు. ఆమెను తెచ్చి, జీససు యె
దుట బెట్టి ఆయన నడిగారు. "ఏమి, అయ్యా! ఈ మనిషి
వ్యభిచారం చేస్తుండగా చూచి పట్టుకున్నాము. ఈ పాపిని

రాళ్ళతో గొట్టి శిక్షించ మని మా 'మోసెసు' యొక్క న్యాయశాస్త్రం చెప్తున్నది. మీ రేమి చేయమంటారో చెప్పండి !"

సందు దొరికితే జీససును మోసం జేసి, మాటల లో బోల్తా వేయించి, ఆక్షేపిద్దా మని వాళ్ళ ముఖ్యోద్దేశం. జీసను కొంతసేపు నిశ్శబ్దంగా ఊరుకున్నాడు. మంచిదే నని చెప్పి రాళ్ళు పుచ్చుకొని ఆమెమీద రువ్వమంటా డా— తాను బోధించే సర్వమానవ ప్రేమసూత్రానికే లోపం వస్తుంది. లేక అపరాధిని శిక్షించడమే, హింసించ డమే తప్పంటాడా— మోసెసుయొక్క ధర్మశాస్త్రానికే విరుద్ధంగా చెప్పడ మౌతుంది. ఈ సందిగ్ధావస్థలో, యేమీ చెప్పక ఒక్కక్షణం తలవాల్చి కాలివేలితో పరధ్యానంగా యిసుకనేలమీద యేదో గీస్తూ నిలబడ్డాడు. నిలువనీయ కుండ తొందరపెట్టి, వాళ్ళు తిరిగి ఆప్రశ్ననే రెట్టించి అతని నడగసాగం మొదలుపెట్టినారు. జీసను తలయెత్తి చూచి యిట్లన్నాడు. "ధర్మశాస్త్రం చెప్తున్నది కనుక ఈమెమీద రాళ్లు రువ్వవలె నంటున్నారు కదా మీరు! అట్లాగైతే, సరే కొట్టవచ్చు—కాని, మీలో ఎన్నడూ యే పాపమూ చేయనివా రెవరున్నారో, వారే ఈమె మీద మొదటిరాయి విసరండి. ఇదే నాకోరిక" న్నాడు. ఈ మాట చెప్పి చింతానిమగ్నుడై తిరిగి తల వంచుకు

న్నాడు జీసను. అతనియొక్క సుబోధక వాక్యము మెరుపు
తీగవలె తెలవని తలంపుగా వాళ్లహృదయాలను దేదీప్య
మానంగా వెలిగించింది. క్షణకాలంలో భూకంపంలాగు
లోపల ప్రవేశించి, వారిహృదయకవాటాలను విదలించి,
ఒక్కసారిగా వారిని ఆత్మపరీక్షలో దింపింది. తత్క్షణమే
నేరారోపకు లందరూ ఒకరివెంట నొకరు అచోటు విడిచి
వెళ్ళిపోయినారు. దీనవదనంతో, పశ్చాత్తప్తహృదయం
తో, ఆ స్త్రీమాత్రం తెల్లబోయి శిలవలె అక్కడనే
నిలిచిపోయింది. జీసను తలయెత్తి చూచాడు స్త్రీమాత్రి
యెదురుగా ఒంటరిగా నిలిచివున్నది అప్పుడు జీసన్నాడు;
"ఏమమ్మా! నిన్నిక్కడకు తీసుకొనివచ్చిన వారిలో
చివరకొక్కరూ నీమీద నేరమే మోపలేదా? ఒక్కరూ
కనబడరేమిటి?" "వెళ్ళిపోయినారు తండ్రి" అని
మాత్రం చెప్పి ఊరుకున్నదామె. "ఓహో! సరే
అయితే నేనుమాత్రం నీమీద నేరం మోపుదునా? లేదు
లేదు. నీదారిని నీవు పోవచ్చు. ఇక ఎన్నడూ పాపాని
కొడిగట్టకు. నీమలినాన్ని కడిగివేసుకొని పరిశుద్ధురాలవు
గమ్మా.' అని చెప్పి ఆమెను పంపివేశాడు.

# 25

మనుష్యులందరూ జగత్పితయొక్క బిడ్డలని, భగవ ద్విశ్వాసంతో తోడిమానవులను తమవలె ప్రేమించడమే ఈశ్వరాజ్ఞ యని జీససు తన ముఖ్యసందేశంగా జనులందరికీ బోధించాడు. ఛాందసుడైన శాసనాధికారి వొకడు జీససు నెట్లాగో తర్కవాదంలో ఓడించి నోరెత్తకుండ చేస్తాననే గర్వంతో బయలుదేరి వచ్చాడు. మనుష్యులందరూ ఎన్నటికీ సమానులు కారని; కనుక జీససుయొక్క ప్రేమ సిద్ధాంతానికి అర్థమే లేదని రుజువుచేసి చూపవలెనని సంకల్పించాడు. ఆగానే జీససును యిట్లా ప్రశ్నించాడు; "అయ్యా తోటిమానవుల నందరిని ఆత్మబంధువులుగా ప్రేమించవలెనంటే అర్థమేమండీ? తోడిమానవుడంటే యెటువంటివాడు?"

జీససు దానికర్థమిట్లా తెలియజెప్పినాడు. "ధనికుడైన ఒక యూదుడుండేవాడు, ఒకనాడతడు తనయింటికి తిరిగి వస్తూవుండగా దారిలో ఒకదొంగలగుంపు అతనిని పట్టుకొని, దగ్గరవున్న సొత్తు లాగుకొని, కొట్టి రోడ్డుపక్క విసిరివేసి పారిపోయినారు. కొంతసేపటికి యూదుల మతబోధకుడొకడు ఆదారిని పోవడం తటస్థించింది. బాట పక్కను పడివున్న మనిషిని చూచాడు. అతడు పడుతున్న అమితబాధను కూడా చూచాడు. స్వజాతివాడని గాని,

మరియే భేదాలతోనూ పని లేకుండా ప్రతివానినీ తనతోడి మానవు డనుకుంటాడు. వానిని సుఖంలోనే గాక, కష్టం లోగూడ ఆత్మబంధువుగా ఆదరిస్తాడు."

---

## 26.

జీసనుయొక్క ధర్మప్రచారం క్రమ క్రమంగా దిశ దిశలకూ వ్యాపించింది. అతనిమీద పరసీయుల కున్న క్రోధావేశం అంతకంతకు మితిమీరి పోతున్నది. కడుపు మంట పట్టజాలక పోయినారు. ప్రజలలో జీసను యెడల అసహ్యత కలుగ జేదామని వ్యతిరేకప్రచారం మొదలు పెట్టనారు: "జీసనుయొక్క మాయబోధలు వినకండి! అత డు ప్రజలనందరినీ మోసం జేస్తున్నాడు. అతడు చెప్పే 'నిబంధనల' నుబట్టి నడుచుకొనడం మొదలుపెడితే చాలా ప్రమాద మున్నది. మోసం దుష్టత్వం—ఇవి యిప్పటి కంటె ఎక్కువై సంఘాన్ని ముంచివేస్తాయి" అని దేశం మీద ప్రబోధం ప్రారంభించారు.

జీసను ఇది తెలుసుకొని ప్రతికక్షులకు ఈలాగు సమాధాన మిచ్చాడు: "ధనకాంక్షను పోగొట్టుకొని భగ వద్విశ్వాసంతో దారిద్ర్య మనుభవించ మని; దెబ్బకు దెబ్బే మందని చెప్పే అమానుషసిద్ధాంతాన్ని రూపు మాపి ప్రేమకొరకును ధర్మంకొరకును ఎంతబాధనైన—

చివరకు చావునైన—సహింపవలెనని నేను బోధించడమే మీాకంత హానికరంగా కనిపిస్తున్నదా? నా సందేశంద్వారా ప్రపంచమింకనూ పాడైపోతుందని; చెడుగును పోగొట్టుటకు బదులుగా మరొక కొత్త చెడుగును నాబోధ తెచ్చిపెడుతుందనేకదా మీారంటారు? కాని యిది సత్యంకాదు. చెడుగును తెచ్చిపెట్టునది నేనుకాను. చెడుగును చెడుగుతోనే యెదుర్కొనవలెననే భ్రాంతిలో మీారే పడివున్నారు. ఇట్లు బెదరింపులు హత్యలు ఉరిశిక్షలు మొదలైన ఘోరపద్ధతులతో చెడుగును నిర్మూలం చేదామని అనుకునేది మీారే. కాని వీటివల్ల చెడు గెప్పటికీ నశించదు. ఏశక్తిగాని తనను తానే నాశనం చేసుకోనేరదు. ఏది యేమైనా మీాపద్ధతులతో చెడుగును పోగొట్టుటకు నేను ప్రయత్నించను. నేను ధర్మంచేతనే అధర్మాన్ని నిర్మూలంచేస్తాను. భగవంతుని కేంట నాతోపాటు ఈ లోకకల్యాణకార్యం నెరవేర్చుటకు ప్రజలనందరినీ ఆహ్వానిస్తాను. ఈధర్మ నియమాన్ని విశ్వాసంతో నిష్కర్షగా పాటించినవాళ్లే చెడుగునుండి విముక్తులు కాగలరు."

---

## 27.

ఒకదినం జీసను మాట్లాడుతుండగా అతని తల్లి తమ్ముళ్లు అతడున్నచోటికి వచ్చారు. వేలకువేలు ప్రజలు

జీససుచుట్టూ దట్టంగా మూగి అతనిమాటలు వింటున్నారు. గుంపులోనుంచి లోపలికి పోదామంటే వారికి దారి దొరకలేదు—బయటనే నిలబడ్డారు. వారక్కడుండడం చూచి ఒకడు జీససును బిగ్గరగాపిలిచి చెప్పినాడు: "అయ్యా! మీ బంధువులూ, మీ తల్లిగారూ తమ్ములు వచ్చారు. మిమ్ములను చూడాలని యిక్కడే కనిపెట్టుకున్నారు."
"ఏమి! నా తల్లీ తమ్ములూనా! ఎవరు నా తల్లి—నా తమ్ములు?

"పరమేశ్వరుని పవిత్రోద్దేశం తెలుసుకొని బ్రతికే వాళ్ళు నా తల్లీ నా సోదరులును!

"తల్లిదండ్రులు, భార్యాబిడ్డలు, సోదరీసోదరులు, సకలైశ్వర్యాలు చివరకు ప్రాణంకంటె కూడ పరమాత్మ యొక్క ఇచ్ఛయే ఆయన ఆజ్ఞయే ఎక్కువ విలువైనది.

"బుద్ధిమంతుడైన ప్రతివాడూ ఏపనిగాని ప్రారంభించుటకు ముందుగా అది లాభకరమౌతుందని నమ్మకముంటేనే దానిని ప్రారంభం చేస్తాడు. లేకుంటే ముందా పనిలోనే ప్రవేశించడు. ఇల్లు కట్టబోయేవాడు ముందుగా అంచనా తయారుచేస్తాడు. ధన మెంత కావలసివస్తుందో తనవద్ద వున్నదెంతో, ఉన్నది సరిపోతుందో లేదో ఇదంతా లెక్కవేసి చూస్తాడు. అంతేకాని నెరవేర్ప లేనను కొనే పనిని తెలివితూలి ముందు ప్రారంభించడు. అట్లా

గే శత్రువులమీదికి యుద్ధానికి పోయేరాజు తనవద్దనున్న పదివేల సైన్యాన్ని ఇరవై వేల శత్రుసైన్యంమీదికి నడిపించి గెలుపొందగలనా యని వెనుకముందులు యోచింపనిదే యుద్ధరంగంలోనికి దిగనే దిగడు. గెలుపొందడమే అసంభవమనుకుంటే యుద్ధమే చేయడు—శత్రువుతో సంధి చేసుకొని వెళ్ళిపోతాడు.

“కనుక సాధారణంగా మనుష్యుడు 'నాది—నా సొత్తు' అని అనుకొనే వస్తువులన్నీ—తన కుటుంబము ఆస్తి శరీరం—నేడో రేపో తనను విడిచి పోయేవే! నిజంగా 'నాది' అనుకోదగినది, మరణంలో ఎప్పుడూ వియోగం పొందనిది ఒక్కటే వస్తువున్నది. మన ఆత్మజీవనమే అది. దానిని గురించి మాత్రం మన మెంతైనా జాగ్రత్త వహించవలసినదే” అన్నాడు జీసను.

ఈ మాటలు విని ఒక శిష్యుడన్నాడు: “ఆత్మజీవనమంటూ ఒకటుంటే నిర్విచారంగా వుండవచ్చు సరే కాని ఉన్నదంతా తీరా యిచ్చివేసి సన్యాసులమైపోతే తరువాత యెప్పుడో యేదో శాశ్వత సుఖం ప్రాప్తిస్తుందని నిశ్చయ మెక్కడ?”

దానికి జీసను సమాధానం చెప్పినాడు. “ఆత్మజీవన మొకటున్నదని; దానికేదిట మనము జరపవలసిన ఉత్కృష్టబాధ్యతలూ, విధులూ వున్నవని; నాశరహితమైన

డొక్కటిమాత్రమే యనీ అందరికీ తెలుసును. తెలుసునే కాని, తెలిసినదానిని ఆచరణలో బెట్టడం మాత్రమెక్కడనూ కనిపించదు. ఆత్మజీవనం మిథ్యయేమో ననే సంశయంచేతగాదు ధర్మాన్ని అనుష్ఠించకపోవడం; ప్రాపంచిక ప్రవృత్తులు మిమ్మి బట్టి తప్పుడు మార్గాలకీడ్చి, నిజమైన జీవితానందాన్ని అందుకో లేకుండ చేస్తున్నదే ముఖ్య కారణం."

తరువాత జీసస్ సొక కథ చెప్పినాడు. "ఒక డొకనాడు గొప్పవిందొకటి చేశాడు. బంధుమిత్రులందరినీ ఆహ్వానించడానికి అన్నిచోట్లకూ తన సేవకులను పంపినాడు. కాని యెవ్వరూ రాననిచెప్పి, సేవకులను తిరిగి పంపివేశారు. 'నేను కొత్తగా భూమి కొనుక్కున్నాను; వెళ్ళి దానినిచూచుకోవాలి, నాకు తీరికలేద'న్నాడొకడు. 'నేను యిన్నే పశువులను కొన్నాను-- పోయి పొలంచుసుక్కోవద్దా? నేను విందుకురాలేన'న్నాడు మరొకడు. 'నాకు కొత్తగా వివాహమయింది; ఈవేళనే నాపెండ్లివిందు! నేనెట్లా వచ్చేది?' అని యింకొకడన్నాడు. సేవకులు తిరిగి యజమానివద్దకు పోయి, యెవ్వరూ రామన్నారని చెప్పినారు. అప్పుడు ధనికుడు ఊళ్ళోవున్న దరిద్రులను బిచ్చగాండ్రను పిలుచుకొని రమ్మని సేవకులను తిరిగి పంపినాడు. పిలువగానేబీదవాళ్లందరూ పరుగెత్తి వచ్చి అమితానందంతో భోజనంచేసి కృతజ్ఞులై వెళ్లిపోయినారు.

"అదేవిధంగా మనుష్యుడు శారీరక తాపత్రయాల నుంచి ఎప్పుడు విముక్తు డౌతాడో అప్పుడే ఆత్మజీవన తత్వం తెలుసుకొని సుఖిస్తాడు."

---

## 28

ఒకనాడొక యువకుడు జీసస్‌వద్దకు వచ్చి సాష్టాంగపడి "సద్గురూ! ఆత్మజీవనం పొందడానికి మార్గమేదో, దయచేసి నా కుపదేశిస్తారా!" అని అడిగాడు.

జీసస్ జవాబు చెప్పినాడు: "అబ్బాయీ! నన్నా-'సద్గురూ' అంటావు! సద్గురు డెవరు? పరమేశ్వరు డొక్కడే! మరెవ్వరూ ఆ బిరుదు వహించరాదు. సరే—ధర్మ జీవనంలో పాటించవలసిన నియమాలు నీకు తెలుసును కదా! వాటి ననుష్ఠిస్తూ సూటిగా పోవడమే ధర్మజీవనానికి మార్గం."

యువకుడు—అయ్యా! ఆ నియమాలేవో చాల వున్నట్లున్నవి. అందులో యేవి మీ రన్నవి?

జీసస్—హత్య, వ్యభిచారం, అనృతం, దొంగతనం— ఇవన్నీ మహాపాతకాలు. దుర్భావలాడి యెన్నడూ ఇతరుల మనస్సు నొప్పించకు. తల్లిదండ్రులను పూజిస్తూ, ఎప్పుడూ వారియెడల గౌరవం చూపవలె.

యువకుడు—నేను చిరకాలమునుంచి—చిన్నప్పటినుంచి—
ఈ నియమాలన్నీ నెరవేరుస్తూనే వున్నానండీ!

యువకు డిట్లా అనగానే జీసస అతనివంక తేరి పార జూచాడు. ఎంతో వాత్సల్య భావంతో అతని చార వకూ చురుకుదనానికీ మెచ్చుకొని వీపు తట్టి యిట్లన్నాడు; "నాయనా! సరే—బాగున్నది! కాని నీలో ఒక్క లో టున్నది సుమా! ముందు నీ వింటికి పోయి, నీ కున్న ఆస్తిఅంతా అమ్మివేసి బీదలకు పంచిపెట్టి ధర్మదీక్ష బూని, తరువాత నా వెంట రా!" అని జీస సనగానే యువకుని హృదయం చాలా గందరగోళం పడింది. అతడు మిక్కిలి ధనికు డవడంచేత, జీసస్ పెట్టిన అగ్నిపరీక్షకు తాళలేక పోయినాడు. ఉన్నవా డున్నట్లే వెనుకకు తిరిగి జవాబు చెప్పకుండా వెళ్ళిపోయినాడు. ఇక నక్కడ క్షణ మాగలేదు.

ఇదొక నిదర్శనంగా చూపుస్తూ జీసస తనశిష్యులతో యిట్లన్నాడు. "ఏమోయి చూచారు కదా! ధనికునికెంత దుస్తరమైన పనో ఈశ్వరరాజ్యాన్ని చేరడం!" అనే సరికి జీసస మాటలు తనశిష్యులకే మితిలేని ఆశ్చర్యాన్ని కలిగించినవి. జీసస వెలిబుచ్చిన సత్యం గొంతుకకి అతిధారావళితదీక్షను గోరుచున్నదో ఎటువంటి అగ్నిపరీక్షలో నెగ్గితేనే గాని ధర్మజీవన మనేది లభించదో తెలుసుగాని

వాళ్ళ హృదయాలు తహతహ పడ్డవి. ఇంతకు ముం దెప్పు
డూ లేని రీతిగా వాళ్ళ గుండెలు కొట్టుకున్నవి. జీసస తిరి
గి ఆ భావాన్ని నొక్కి, చెప్పుతూ "అవును! కాని మీరు
వట్టి శిశుప్రాయులుగా వున్నారే! సాధించిన కనకరాసులనే
నమ్ముకొన్న ధనికు డెక్కడ—స్వర్గరాజ్య మెక్కడ!
సూదిబెజ్జములోనుంచి ఒంటె అయినా అవలీలగా దూరి
పోగలదు గాని ధనికునికి మాత్రం స్వర్గరాజ్యం దొర
కదు! అంత సరళంగానూ స్పష్టంగానూ జీసస ధర్మత
త్వాన్ని విప్పి చూపేటప్పటికి శిష్యుల గుండెలు కూడ
దడదడ కొట్టుకొన్నవి. ఇన్నాళ్ళనుంచి ధర్మతత్వాన్ని
జీససుముఖతా దినదినం వింటున్నప్పటికీ చివరకు తాము
కూడా ఐహికసౌఖ్యాన్ని నమ్ముకున్న వాళ్ళమే యని తెలు
సుకున్నారు. జీసస యొక్క ఆగ్నిమయవాక్యాలు విని శి
ష్యులహృదయాలు అప్పటికప్పుడు కదిలి, జలదరించిపో
యి, కంగారుగా తమలో తాము గుసగుస లాడుకుంటూ
"అయితే యిక బ్రతికే దెట్లాగో కదా! మనుష్యులమై
పుట్టినతరువాత తిని సుఖించడాని కేదో యింత వుండా
లి గదా! వున్నదంతా యితరులకు పంచిపెడితే ఇక పూ
ర్తిగా మాడిపోవలసిందేగా!" అని కల్లోలపడ్డారు. జీసస
ఆఅవిశ్వాసపు మాటలు విని వారికి జవాబు చెప్పినాడు.
"కేవలం శరీరమే పరమధనంగా యెంచుకొని బ్రతికే

వాళ్ళకు ఈస్థితి అతిభయంకరంగా కనిపిస్తుంది. ఆత్మవి శ్వాసులకు మాత్రం అంత సులభసాధ్య మైనదీ అంత ఆనందదాయక మైనదీ మరేదీ వుండదు. ఎవరు పూర్ణవి శ్వాసంతో సాధకు లౌతారో వారే దీనిని సత్యాలలో కెల్ల ఉత్కృష్టమైన సత్యంగా తెలుసుకుంటారు."

---

## 29.

ఒకసారి జీసను తనశిష్యులను కూర్చోబెట్టి హిత బోధ చేశాడు: "మీరు ఒక్కసారిగా ఇద్దరు గురువులకు ఎట్లా సేవచేస్తారు? పరమాత్మ నొకవైపున, డబ్బు నొకవై పున—ఇద్దరినీ ఒకేసారి పూజింపగలుగుట అసంభవం కదా! భగవంతుని ఆజ్ఞనో, లేక మీ స్వేచ్ఛాచారమునో- ఈరెంటిలో ఏదో ఒకదానిని మాత్రం కోరుకొని సేవింప గలుగుతారు."

ఆ సమయాని కక్కడనున్న పరసీయులు కొంద రీమాటలు విన్నారు. పరసీయులకు ధనకాంక్ష యెక్కువ. జీసనుమాటలు విని నవ్వడం మొదలుపెట్టినారు. అప్పుడు జీసను వారితో యిట్లన్నాడు:" మీ ఐహికసంపదను, మీ కృత్రిమపు వలుకుబడిని చూచి మిమ్ము ప్రపంచం గౌరవి స్తున్నది. మీరది చూచుకుంటూ 'ఔను నిజంగా గౌరవ నీయులమే' అని యనుకుంటున్నారు. కాని అందులో

న్యాయంగాని, మీ అర్హతగాని యేమీలేదు. భగవంతు
డెప్పుడూ పై వేషభాషలు, చూడడు. లోపలి హృదయా
న్నే అతడు పరీక్షించేది! మూఢప్రపంచంచేత గొప్పగా
చూడబడే వస్తువులు భగవంతుని దృష్టిలో ఎందుకూ పనికి
రానివి. ధనికు లెప్పటికీ స్వర్గసుఖాన్ని పొందలే రంటిని.
బీదలకే, దీనులకే ఉన్నదా పాత్రత!"

అప్పటి పరిసీయులలో ఒకనమ్మక ముండేది, చని
పోయిన తరువాత కొందరు నరకానికీ కొందరు స్వర్గానికీ
పోతారని వాళ్లనుకొనేవారు. వాళ్ల కవిశ్వాస మున్నట్లు
జీసనుకు తెలుసును. మనుష్యుల జీవితాలను ధ్వంసంచేసి
పారవేసే ధనకాంక్షను గూర్చి ఒకకథ చెప్పినాడు. "ఒకా
నొక ధనికు డుండేవాడు. సమస్త ఐహికఐశ్వర్యాలూ
అనుభవించేవాడు. విలువైన బంగారువస్త్రాలతో పంచభ
క్ష్యభోజనాలతో మన్నూ మిన్నూ గానకుండ బ్రతికేవా
డు. ఆ వూళ్లోనే ఒకగర్భదరిద్రు డుండేవాడు. వానిపేరు
'లాజరసు' కుష్ఠువ్యాధితో బాధపడుతూ, బిచ్చ మెత్తుకుం
టూ కాలక్షేపం చేసేవాడు. లాజరసు ధనికుని వాకిటిగు
మ్మం బయట కూలబడి వుండేవాడు. తిని మిగలగా పార
వేసిన రొట్టెపెచ్చు లేమైనా, దొరికితే తిని ప్రాణం నిల
బెట్టుకుందామని ఆశ, పాపం! కాని యేమీ దొరికేదికా
దు. బయట విసరగానే రొట్టెపెచ్చులన్నీ కుక్కలు వచ్చి

ఎత్తుకొనిపోయేవి. వాటికింకా ఆకలి తీరక లాజరసు వంటి నున్న పుండ్లుకూడా నాకి బాధించడం మొదలుపెట్టేవి. ఒకనాడు లాజరసు చనిపోయినాడు. ధనికునికీ కాలం నిండింది—చనిపోయినాడు; నరకలోకప్రాప్తి కలిగింది. నరకలోకంనుంచి తలయెత్తి చూచాడు. చాలదూరాన్ని ఏబ్రహాము కనబడ్డాడు. ఇదికాక లాజరసు ఏబ్రిహాముయొక్క ఒడిలో కూర్చున్నట్లు కూడ కనిపించాడు. అప్పుడా ధనికుడు హృదయవేదనతో అంటాడు—తండ్రీ ఏబ్రిహామూ! మీకు కష్టం కలుగజేయడం నాకిష్టంలేదు. మా గుమ్మంబయట కూర్చునే బిచ్చగాడు, లాజరసు, మీదగ్గర కూర్చున్నట్లున్నాడు. వానినొకసారి నావద్దకు పంపుదురూ! అబ్బబ్బా! నే నీమంటలలో బడి చచ్చిపోతున్నానే! వాడైనా (లాజరుసు) వచ్చి ఒక్క చల్లని నీటిచుక్క నా గొంతుకలో విదల్చితే ప్రాణం చల్లబడి బ్రతుకుతానేమో కదా నాయనా!' దూరంనుంచి ఏబ్రిహాము జవాబు చెప్పినాడు: 'లాజరసును ఆ మంటలలోని కెట్లా పంపవలెను? ఎందుకు పంపవలె? కావలసిన దల్లా, కోరుకున్న దల్లా భూలోకంలో నీవనుభవించావు. అక్కడ లాజరసుకు దుఃఖమూ, బాధా తప్ప మరేమీ లేకపోయింది. నీవడిగినట్లు, ఒకవేళ, లాజరసును పంపుదామనుకున్నా, మే మున్నతావునుంచి నీదగ్గరకు మార్గమే కనబడదు; మధ్య నేదో

పెద్ద అగాధమున్న ట్లున్నది. కనుక పంపడం సాధ్యంకా
దు' అప్పుడు ధనికు డన్నాడు: 'అయితే, బాబూ! లాజరను
నొకసారి దయచేసి మాయింటికైనా పంపండీ! నాకైదు
గురన్నదమ్ము లున్నారు; వాళ్లగతి యేమౌతుందో అని
నాకు భయంగా వున్నది. వాళ్లైనా ఈ అవస్థలో పడ
కుండా ధనకాంత తెచ్చేఫలిత మిదని, లాజరును పంపి
మావాళ్లకు చెప్పించండీ!' 'ఆసంగతి వాళ్లకే తెలుసును.
మోసెసు, మరి అనేకమంది ప్రవక్తలు ఆవిషయం ప్రపం
చానికెన్నిసార్లు బోధించారో!' అని ఏబ్రహాము జవా
బిచ్చాడు. 'అయినా, ఈలోకంనుంచి యెవరైనా పోయి
చెపితేనైనా, వాళ్లు బాగా గ్రహించి ముందుగా జాగ్రత
పడతారని చెప్పి ధనికుడు యేబ్రహామును మరీమరీ వేడు
కున్నాడు. కాని ఏబ్రహాము ఒప్పుకోలేదు: 'అంతమంది
ప్రవక్తలు చెప్పినమాటే విననివాళ్లు ఇప్పుడు శిక్షాస్థానంనుంచి
పనిగట్టుకొని యెవరు వెళ్లిచెప్పినా వినరని ధనికునికి జవా
బుచెప్పి ఊరకున్నాడు".

## 30.

కొన్నిదినాలకు జనసు జూడాదేశం వదలిపెట్టి గెలీ
లీకి పోయి తల్లిదండ్రులతో కలసి కొంతకాలమున్నాడు.
యూదుల కొక పండగదినం (పంటకోత-పండగ) వచ్చింది.

ఆసందర్భంగా పెద్ద విందొకటి జరిగింది. జీససుయొక్క తమ్ముళ్లు విందుకు పోదామనుకొని ప్రయాణ మైనారు. జీససునుకూడ రమ్మన్నారు. వీళ్లకు కూడ జీససుఉపదేశం లో యేమీ నమ్మకంలేదు. "ఇదిగోనోయి, ఇదే సమయం! యూదుల పూజలూ, ఆచారాలూ తప్పంటావుగా నీవు! భగవంతుని పూజ చేసే మార్గమేదో నీకు తెలుసునని గూడ అంటావు కదా! దేశంలో మరెవ్వరికీ తెలియని అన్నివిషయాలూ నీకే తెలుసు ననుకుంటే, ఇప్పుడు జూడాకు రారాదా? దేవాలయంలో ఇప్పు డొక గొప్ప విందు జరుగ బోతున్నది; నీవుకూడ రా! అక్కడికే వస్తారు, నీకు కావలసినంతమంది ప్రజలు; నీ వుద్దేశాలన్నీ అక్కడ అందరికీ బోధ చేయవచ్చు. నీవు చెప్పేదే సత్యమని అక్కడి వాళ్లందరూ ఒప్పుకుంటే, అందరూ నిన్నే నమ్ముతారు కదా! నీకు తెలిసినదానిని దాచుకోనడమెందుకు? మా ప్రార్థనలూ, మా పద్ధతులూ తప్పనడమే కాకుండా, నీకు మాత్రమే సరియైనమార్గం తెలుసునని కదా నీ వంటావు? సరే— తెలిస్తే, మాతో వచ్చి అక్కడున్న ప్రతివానికీ తెలియజెప్పు"మని తేలికభావంతో జీసను నడిగినారు. అప్పుడు జీస సన్నాడు: "నే నిప్పుడు రాను— సమయం వచ్చినప్పుడు రాక మానను. మీరు వెళ్లవచ్చు!" ఇదివిని జీసను తమ్ముళ్లు వెళ్లిపోయినారు.

ఇందుకు చాలమంది వచ్చారు. జీసస్ చేసిన బోధ
లను విమర్శిస్తూ యెవరికిష్టం వచ్చినట్లు వారు మాట్లాడడం
మొదలు పెట్టినారు. అతని సందేశం చాల బాగున్న దని
కొంద రన్నారు. మరికొంద రన్నారు—ప్రజలలో కల్లో
లం పుట్టించి దేశాన్ని ధ్వంసంచేస్తున్నాడని. ఇంకా
ముగియ లేదు; జీసస్ జెరూసలేముకు వచ్చాడు, రాగానే
దేవాలయంలోనికి పోయినాడు. ముంగటివసారాలో యె
న్నో పశువులు కట్టుకట్టాలతో కట్టబడి వున్నవి. చాలా ఆవు
లను, ఎద్దులను, గొఱ్ఱెలను జీసస్ చూచాడు. లెక్కలేని
సాధుపక్షులెన్నో పంజరాలలో కట్టబడి వున్నవి. ఈ జీవు
లన్నీ దేవతలకు బలియనిమిత్తం తెచ్చి పెట్టబడ్డవే. గల్లా
పెట్టెలమీద డబ్బు పోగుపోసుకొని కూర్చున్న చిల్లరివ
ర్తకులు టెంపిల్లో కనబడ్డారు. లోపల వేలకొలదిజనులు కిట
కిటలాడుతూ జీససుకు కనబడ్డారు. ఆవరణంతా పెద్ద గణ
ధ్వనితో నిండిపోయింది. ఈ స్థితిలో జీసస్ లోపల ప్రవే
శించాడు. మొదట ఆవులన్నిటినీకట్టుతాళ్లు విప్పి బయ
టకు తోలివేశాడు. పంజరాలలోని పిట్టల నన్నిటినీ విడి
పించి యెగరగొట్టేశాడు. చిల్లరివర్తకుల గల్లాపెట్టెలమీది
డబ్బంతా కింద చిమ్మరించాడు. తరువాత ఒకచోట నిల
బడి జనసమూహాన్ని సంబోధించి ఇట్లా చెప్పినాడు:
“ఇదయా’ మహాపవిత్ర స్థలం, ఏం చేస్తున్నారు! జెరూసలేములో

నున్న గుడి కాదు, భగవంతుని నివాసస్థలం! మానవకోటి చేత నింపబడ్డ ప్రపంచమంతా ఆయనఆలయమే! జెరుసలేమునివాసుడే కాదు—జగన్నివాసు డాయన!' అని బోధించ లేదా? 'జెరిమయ' మహాప్రవక్త యే మన్నాడో చూడండి! 'ఆద్యంతాలు లేని దేవునిగృహము ఈగుడియే యని నమ్మి మీరు మోసపోవద్దు. మీ జీవితాలూ, మీ ఆలోచనలూ మార్చుకోవలె. అన్యాయంగా పీడితమనుష్యులమీద నిందలు మోపకండి. అనాథ స్త్రీలనూ, బిడ్డలనూ బాధించి ఆ నిరపరాధుల రక్తంతో మీచేతులు మలినం చేసుకొని దేవాలయంలోనికి వెళ్లి 'నరే' యిష్టాను నాయిష్టం వచ్చినట్లు, నిర్భయంగా తప్పులు చేయవచ్చు'నని చెప్పి, మీ అవకతవక సిద్ధాంతాలతో నాపవిత్రగృహాన్ని దొంగల గుహగా మార్చవద్దు—పోండి! మీ క్రూరహత్యలు, పశువధలు నాకు సంతృప్తి నీయవు. మీలోనుండే పరస్పరప్రేమచేతనే నేను పరమానందభరితుడనౌదు' నన్నాడు. వినండి! భక్తశిఖామణులయొక్కయు సత్యప్రవక్తలందరియొక్కయు సందేశంలోని అర్థమిదే! పరిశుద్ధమై పరస్పరప్రేమతో నిండిన మనుష్య (ఆత్మ) ప్రపంచమే జీవవంతమైన బ్రహ్మమందిరం. గుళ్లూ గోపురాలూ కావు—భగవంతునిపూజ చేసే స్థలాలు. పరమాత్మయొక్క స్పర్శచే మేల్కొల్పబడ్డ జీవితంలోనే ఆయన

దర్శనం కావలె!" అని జీసను చెప్పినాడు. జనసమూహ
మంతా జీసనుమాటలు విని ఆశ్చర్యపడ్డారు. "ఏమీ చదు
వుకున్నవాడు కాడే! ఇతని కింతటి జ్ఞాన మెట్లా అబ్బినదో"
అని ఆశ్చర్యంతో ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు. తన
మాటలు వాళ్లకు చాలా ఆశ్చర్యం కలిగించాయని జీసను
కనిపెట్టి యిట్లన్నాడు. "మీరాశ నేను తీసుకొనివచ్చిన సం
దేశం నాది కాదు—భగవంతునిదే! నన్ను పవిత్రకార్యా
నికి నియోగించిన మహానుభావునిదే! లోకులు పరమప్రతి
ష్ఠలు సాధించేనాడు మాత్రమే ఆ సందేశంనాదే నని గర్వ
పడతారు: భగవంతుని ఆజ్ఞకోసం సందేశం వేచివుండే
వారే ఆ యమృతస్వాదాన్ని పొందుతారు. ఆయన బిడ్డలే కనుక
వారు అమృతపుత్రులే! నేనూ, కృత్రిమంగానే వాళ్లా అతీ
తులు. నా మనస్సున ఒక యోగం రూపొందింది, దానిని
నెరవేర్చ మనడమే కదా నా ముఖ్యసందేశం! ఈధర్మసాధ
నను కృతసంకల్పంతో మీరు ప్రారంభం చేస్తే, ఇది
నాచేత కల్పించబడ్డ విషయం కాదని; ఈ సత్యసందేశమే
యుగయుగాలనుంచి, యెప్పటి కప్పుడు భగవంతునివద్ద
నుంచి వస్తున్నదని మీరు తెలుసుకోగలరు"

ఈ గంభీరోపన్యాసం విని చాలామంది అన్నారు:
"ఇతడు మోసగాడంటిమే! ఎంత తప్పు!! ఎంత స్పష్టంగా,
నిర్భయంతో ఇంతమందియెదుట మాట్లాడినాడు! ఒక్క

మాటైనా సరికాదని ఎవరైన అనగలిగినారా?—కాని, ఇతడు భగవంతునిదూత కాడని అనుమానించడానికి కారణం లేకపోలేదు. ఈశ్వరదూత వచ్చినప్పుడు అతని జన్మవృత్తాంత మెవ్వరికి గాని యేమీ తెలియకుండానే, అద్భుతంగా అవతరిస్తాడని చెప్పే శ్రుతివాక్యం మాత్రం తప్పు కానేరదు. ఈమనిషినీ (జీసను) ఇతనికుటుంబాన్నీ చాలకాలంనుంచీ మనమందరమూ యెరిగే వున్నాము. మరి యితడే యుగపురుషుడంటే యెట్లా నమ్మవలిసింది?" జీసను ఈమాటలు విని ప్రత్యుత్తర మిచ్చాడు: "మీరు నిజంగా నన్నెరుగుదురా? ఈశరీర మెక్కడనుండి వచ్చినదో తెలుసుకున్నారే గాని, ఆత్మప్రపంచంలో నాజన్మ యొక్క రహస్యం మీరే మెరుగుదురు? ఆత్మీయవ్యక్తిగా నే నెవరినుండి వచ్చినానో, ఆమహనీయుని మాత్రమే మీరు బాగా తెలుసుకోవలిసింది. నేనే దేవదూత నని చెప్పుకుంటూ భగవంతుని సర్వజ్ఞత్వాన్ని నామీదనే వేసుకొని మీవద్దకు వస్తే నన్నీ పాటికి మీరందరూ బ్రహ్మరథం పట్టేవుందురు. కాని నాలోనూ మీలోనూ నిండివున్న పరమేశ్వరునిపేరిట ధర్మప్రచారకుడుగా, భగవత్సేవకుడుగా మీవద్దకు వచ్చాను గనుకనే, నాకీ అనాదరణ చూపుతున్నారు. మీరు నిజంగా విశ్వాస ముంచవలసినది ఒక్క పరమేశ్వరునియందే!"

# 31.

ఈ అద్భుతదృశ్యం చూచినవాళ్లు, జీససుయొక్క అమృతజీవితతత్వంవిన్నవాళ్లు చాలమంది "ఓహో! ఇతడు మహానుభావుడ"న్నారు. మరికొందరు, "కాదు కాదు, ఇతడు నిశ్చయంగా అవతారపురుషుడే—మనపురాణాలు సూచించిన ఈశ్వరదూత!" అని బిగ్గరగా అనడం మొదలుపెట్టినారు. మరికొందరు సంశయాత్ములు "అయితే, ఈశ్వరదూత గెలిలీనుండి యెట్లా వస్తాడేమి! 'డేవిడు' వంశంలో బుట్టి 'బెత్లెహాము' నుంచి వస్తాడని మనధర్మశాస్త్రం చెపుతున్నద"న్నారు. ఈవిధంగా జీససునుగూర్చి చాల అభిప్రాయ భేదాలూ, తగాదాలూ కూడ ప్రబలడం మొదలుపెట్టినవి. ప్రజలలో పెద్ద గగ్గోలు పుట్టినది.

తరువాత దేశంలో పెద్దపెద్ద మతాచార్యులు, గురుపీఠాధిపతులు జీససును బట్టి తీసుకొని రమ్మని భటులను పంపించారు. కాని వెళ్లిన భటులకు అతనిని తాకడానికైన మనోనిబ్బరం లేకపోయింది. అతనిని చూచేటప్పటికే వాళ్ల క్రూరస్వభావమంతా కరిగి నీరైపోయి, హృదయకంపం పుట్టింది. ఏమీచేయలేక తిరిగి తమ యజమానులవద్దకు పోయినారు. "ఏమిది! చెప్పినపని నెరవేర్చకుండా యెందుకు వచ్చార"ని అడిగినారు. "అయ్యా, తోమండీ! ఆ మహానుభావుని శక్తి! ఆయనవలె మాట్లా

డగలిగిన మానవు డీప్రపంచంలో యెవ్వడైనా పుట్టినా డా!" అని నిర్భయంగా జవాబిచ్చారు.

"అరే, మీరూం పడ్డారా, గోతిలో? మన పరిపాలకులలో గాని, పరసీయులలో గాని ఒక్కరికైనా ఈమనిషిపై విశ్వాసమున్నదా? దేశంలో దౌర్భాగ్యులకే, మూర్ఖులకే ఇత డంటే వెర్రినమ్మకం" అని యజమానులు వాళ్ళమీద ఆగ్రహించి కేకలు వేసినారు.

తరువాత యెక్కడివా ళ్ళక్కడ యిండ్లకు పోయినారు. జీససుమాత్రం తనశిష్యబృందంతో 'ఆలివ్' పర్వతానికి వెళ్ళి ఆరాత్రి అక్కడనే వుండి, తెల్లవారగానే తిరిగి గుడివద్దకు వచ్చాడు. అతనినిజూచి చాలమంది వచ్చి చుట్టూ నిలబడ్డారు. జీసను తిరిగి వాళ్ళనుద్దేశించి యిట్లా వుపన్యసించాడు: "నా సందేశం ప్రపంచానికి శుభమే చేకూర్చుతుంది. ఆత్మజ్యోతియొక్క వెలుతురును ప్రపంచంలో ప్రసరింపజేయడమే నాజీవితపు పని. ఈ వుపదేశమెవరుస్వీకరిస్తారో వారి జీవితమార్గం జ్యోతిర్మయమై ప్రకాశిస్తుంది. సత్యాసత్యాలూ, మంచిచెడ్డలూ ఆజ్యోతి యెదుట బెట్టి పరీక్షిస్తే స్పష్టంగా కనబడతవి. నన్ను మీవద్దకు పంపిన నా తండ్రియైన స్వర్గాధిపతి ప్రతిహృదయాంతరాళంలో నిరంతరం యేసద్బోధ చేస్తున్నాడో, ఆ సత్యవాక్కు. నే నే నిప్పుడు మీయెదుట పెడుతున్నాను."

"మీతండ్రి యెక్కడ నున్నాడ"ని కొందరు జీసను నడిగినారు. "నన్ను మీరు తెలుసుకుంటే నాతండ్రియెవరో కూడ మీరు తెలుసుకోగలర"ని జీసను బదులుచెప్పినాడు. "అయితే, నీ వెవరవో చెప్పు"మన్నారు. జీస నిట్లా జవాబు చెప్పినాడు: "ఆద్యంతాలు లేని ఒక ఆత్మను నేను. నేనును మీవలె మనుష్యుడనే. కాని నే నాపరమాత్మనే నాతండ్రిగా త్రికరణశుద్ధిగా స్వీకరించాను. మానవుడైన నన్ను మీరు పవిత్రమైన ఉన్నతదృష్టితో చూడగలిగినప్పుడే నే నెవరినో బాగా తెలుసుకోగలరు. నాతండ్రి నాకు బోధించిన పవిత్రపాఠాన్నే మీకు చెపుతున్నానని; ఆయన నాకు నియమించిన పనినే చేస్తున్నానుగాని నా యంతట నే నేమీ చేయుట లేదని, అప్పుడు గాని మీరు తెలుసుకో లేరు."

## 32

ఒకదినం జీసనుచుట్టూ చాలమంది యూదులు గుమిగూడి అతని నడిగినారు: "నీవు చెప్పేదంతా మాకర్థం కావడంలేదు. పైగా మా ధర్మశాస్త్రానికిని నీ విపరీతబోధకును ఎక్కడా సంబంధం లేదు. మీ సిద్ధాంత మేమీ మాకు తెలియదు. స్పష్టంగా చెప్పగలిగితే చెప్పు గాదా? లేకుంటే మా [illegible] చెప్పిన [illegible]. వస్తాడన్న [illegible] నీవేనా లేమి?"

జీసను అన్నాడు "నే నెవరినో ఇదివరకే చెప్పినాను—కాని మీరు నమ్మలేదు. నేనుచెప్పినట్లు చేయండి!—నే నెవరినో, ఎందుకు వచ్చానో స్పష్టంగా బోధపడుతుంది. ఎవరు న న్ననుసరించి నేను చెప్పినట్లు చేస్తారో, నా సందేశాన్ని అర్థంచేసుకొని దానినినిరాఘాటంగా అమలు జరుపుతారో, వారు నాకూ నాతండ్రికీకూడ సహవాసులు. నాతండ్రియందే నావునికి; నేనూ, నాతండ్రీ—యిద్దరమూ ఒకటే!"

ఈమాటలు విని యూదులు మండిపడ్డారు. జీసను ను చంపుదామని చేతులతో రాళ్లుపట్టుకొని నిలుచున్నారు.

జీసను:—ఎందుకు, నన్ను చంపవలెనన్న కోరిక మీకు ?
నేను మీ కేమి అపకారం చేశాను?

యూదులు:—మనుష్యుడవై యుండి, నేనే దేవుణ్ణనిఅంటున్నావు కనుక నీకు మరణదండన విధించవలె!

జీసను:— నేను భగవంతుని బిడ్డలలో ఒకడననీ; ఆయన యిచ్చను నెరవేర్చునప్పుడు ఆయనలో ఐక్యమౌతాననీ చెప్పినాను. ఎవడు యెప్పుడు తాను భగవంతునిబిడ్డ నని విశ్వసిస్తాడో అది మొదలుగా వానిసత్వమనేది.వానిని విడిచిపోతుంది. అనంతమైన పవిత్రజీవితాన్ని చేపట్టి సుఖిస్తాడు. సేవకుడైనవాడు రాత్రింబగళ్లు యజమానియింట్లో పనిపెట్టుకొని వుండడు గదా! గృహస్థుని కుమారుడు అట్లు

అప్పుడతనిని యేమి చేయుటకూ వాళ్ళకు తోచ లేదు. నేరం మోపి, గచ్చ కీడ్చి, శిక్ష వేయించడానికి అప్పటి కింకా సాధ్యం కాదనుకున్నారు. తరువాత జీసను జార్డన్‌నది దాటి అవతలి ప్రాంతానికి వెళ్ళిపోయినాడు.

---

## 33

ఒక రోజున జీసను జెరుసలేముకు తిరిగి పోతుండగా అతనిశిష్యు లిద్దరు (జేమ్సు, జాను) దగ్గరకు వచ్చి: "స్వామీ, మా దొక ప్రార్థన! మే మడిగినది చేస్తానని దయచేసి మీరు మాతో వాగ్దానం చేయవలె" నన్నారు. "మీకు కావలసిన దేమో చెప్పరాదా?" అని జీసు అడిగినాడు. శిష్యు లన్నారు: "మేము మీతో సరిసమానుల మయ్యేటట్లు చేయవలె. దీని కేమి సాధనమో చెప్పండి." అప్పుడు జీసు శిష్యు జవా బిచ్చాడు: "ఎంత జ్ఞానశూన్యత! మీ రడిగే దాని కర్థం మీ కే తెలియనట్లున్న దే? ప్రతివాడూ తన శక్తిచేత ప్రయత్నంచేసి ఈశ్వర రాజ్యాన్ని చేరగలడే గాని మరొకని ప్రయత్నం, సహాయంద్వారా ఎన్నటికినీ పోలేడు." అని వాళ్ళిద్దరితో చెప్పి మిగిలినశిష్యు లందరినీ దగ్గరకు పిలిచి యిట్లా చెప్పినాడు: "'ఎవడు పెద్ద—ఎవడు చిన్న?' అని తర్కించడమే ప్రపంచకళ్లు మూరపదతి. కాని మీలో మాత్రం

ఎవరూ ఎక్కువ కారు, ఎవ్వరూ తక్కువా కారు. ఇందులో అధికు లెవరు, అధము లెవరు? అందర మూపరమాత్ముని బిడ్డలము కామా? మీలో యెవడు సమస్తభేదాలు, తారతమ్యాలు మరచి అందరనూ ఒకటిగా చేసే సేవా దీక్ష పూనుతాడో వాడే ఉత్తముడు. 'నేనందరిలోను అధమాధముడ' నని వినయాన్ని తెలదాల్చినవాడే ఉన్నత స్థాన మలంకరిస్తాడు. ఎప్పుడూ యితరులవల్ల సేవ పొందుతూ బ్రతకడమే పరమావధి కాదు కదా! స్వార్థచింత లేక, ప్రతిజీవికీ సేవ చేయడమే ఈజీవితానికి పరిపక్వస్థితి, ఆత్మవిజయంకొరకు శారీరికజీవితాన్ని అర్పించడానికి సదా సంసిద్ధులమై వుండడమే భగవంతుని యిచ్ఛ."

## 34

ప్రాపంచికపు కొద్దిగొప్పలను గూర్చి జీసస్ తన శిష్యులకు మరొకకథ చెప్పినాడు. "ఒకనాడొక భూస్వామి తనతోటలో పనికి కూలీలను నియమించడానికి బయటకు వెళ్ళినాడు. ఒక్కొక్కనికి దినాని కొక షిల్లింగు కూలి యిస్తానని ఒప్పుకొని, పని నియమించి పంపినాడు. కొంచెం పొద్దెక్కిన తరువాత, పనియేమీ లేక తిరిగే వాళ్లు కొందరు తనకంట బడ్డారు. 'మీరు కూడా వెళ్ళి నాతోటలో పనిచేయండి; కూలి యెంత వస్తే అంతా

యిస్తా' నని చెప్పి వాళ్ళనుకూడ, పనిజెప్పి, తోటకు పంపించాడు. తిరిగి మధ్యాహ్న సమయంలో కొందరిని, పొద్దు కుంకేసమయంలోకూడ మరికొందరిని, పనిదొరకక కాలయాపనం చేసేవాళ్ళను చూచాడు. 'రోజంతా పని లేకుండ యిట్లా వృథాగా యెందుకు తిరుగుతా రబ్బా యీ!' అని అడిగినాడు. 'మా కెవ్వరూ పనిచెప్ప లేద'ని వాళ్ళన్నారు. 'అయ్యో, అట్లాగునా? మీరు మాత్రం మాతోటలోనికి పోయి ఎందుకు పని చేయకూడదు? రావలసిన కూలేదో తీసుకోండి!' అని వాళ్ళందరినికూడ తోటకుపంపి పనిచేయించాడు. పొద్దు కుంకింది, పని వాండ్లకు కూలియిచ్చేసమయ మయింది.

అందరికంటె చివర తోటపనికి వచ్చిన కూలి వానితో ప్రారంభించి, ఉదయాన్నే పనికివచ్చిన వాని వరకూ—అందరికీ సమానంగా ఒకేకూలి యిచ్చి పంప మని భూస్వామి తన గుమాస్తాకు ఆజ్ఞయిచ్చాడు. సాయం కాలం పనిలో ప్రవేశించినవాళ్ళకు ఒక్కొక్క షిల్లింగు చొప్పున యివ్వడం ప్రారంభంజేశారు. అది చూచి తమకు షిల్లింగుకంటె యెక్కువేదో యిస్తారని రోజంతా పనిచేసిన కూలీలనుకున్నారు. కాని చివరకు వాళ్ళకుకూడ షిల్లింగుచొప్పునే ముట్టింది. సాయంకాలం ఒకగంట మాత్రం పని జేసిపోయిన వాళ్ళనుకూడ తమతో సమానం

చేశారని రోజంతా కష్టపడినవాళ్ళకు చాలా కష్టంతోచి 'ఇది చాలా అన్యాయము'ని గోలపెట్టినారు. అప్పుడు తోటయజమాను సన్నాడు: 'మీకంత ఓర్వలేనితనం పనికి రాదు. ఒకషిల్లింగు కూలికి ఒప్పుకొని రాలేదా? నాడబ్బు నాయిష్టంవచ్చినట్లు ఖర్చుపెట్టుకొనేటందుకుకూడ నాకు హక్కు లేదాయేమి? వాళ్ళయెడల నేను దయజూపినందుకే మీకింత ఆగ్రహమా? మీతోడిసోదరుల సుఖాన్ని చూడ లేక ఇంతఅసూయ జెందడమే చాల తప్పని!'

"మన ధర్మజీవితవిధానంలో కూడ భగవంతుడు వెనుకముందులు పాటించడు. వెనుక యెవరు వచ్చారు, ముందెవరు వచ్చినారనే భేదము చేయక వచ్చిన వారికెల్ల కృపానిధుడు ముక్తిప్రసాదం చేస్తాడు. ముందువచ్చినవారి కెంతో వెనుక వచ్చినా అంతేభిక్ష.—అంతే ఆదరణ."*

# 35

ఈ సత్యం సుబోధకమయ్యేటందుకే జీసను మరొక కథచెప్పినాడు. "ఒకనికిద్దరు కుమారులున్నారు. తండ్రిని విడిచి వెళ్ళిపోదామనే దుర్బుద్ధిపుట్టింది చిన్నవానికి. వెంటనే తండ్రివద్దకు వెళ్ళి 'నాయనా! నావంతు ఆస్తి నాకు పంచివేయ'మని అడిగినాడు. ఎవరెన్ని చెప్పినా వినక, పట్టి నిర్బంధించి ఆస్తి పంచుకున్నాడు. అంతా అమ్మివేసి

డబ్బుచేతబట్టుకొని మరొక దేశం చేరినాడు. కొద్దికాలం లోనే అంతా ధ్వంసంచేసుకొని, కటికి దరిద్రుడైనాడు. సామాన్యగౌరవం కూడ పోగొట్టుకొని, ఒకచోట పందుల దొడ్డి కాపరిగా కుదిరినాడు. తాగడానికి గంజికూడా దొరకని స్థితికివచ్చాడు. పందులకువేసే కాయకసరులే పందులతో కలిసి తినవలసివచ్చింది. ఈ దుర్భరావస్థలో ఒక్కసారి దృష్టిని లోపలివైపు తిప్పినాడు. పట్టలేని హృదయ తాపంకలిగింది: ‘బుద్ధిలేక,నాతండ్రితో వివాదపడి అతనిని విడిచి రావడమేతప్పు. నేనే దుష్టుడ నై పోయినాను గాని, నాతండ్రి నే నేదడిగితే నాకియ్యలేదు? ఆయనవద్ద నున్నంతకాలంనాదిగాని దేదుండేది? ఆయనదంతా నాదే! ఆయన కేమిలోటున్నది? ఆయనకూలివానికి కూడ తినగలిగినంత తిండీ, కావలసినంత సౌఖ్యమూ కదా! ఆయనముద్దుబిడ్డ నైన్న నాకో!—పందులతో పాటు గడ్డివేళ్ళూ, తుంగదుంపలును! అయ్యో! నాయనా ! ఏమిటి, నాగతి!—తిరిగి నా తండ్రివద్దకు పోతాను. ‘బ్రతుకలే నయ్యా, తండ్రీ! అని ఆయనపాదాలమీద పడతాను. నాయనా, నే నధమపాతకి నయ్యా! నీకెంత అపచారం చేశాను! నేను నీబిడ్డనేనా? కాదు. లేదు, అట్లనుకోడానికి నాకర్హతలేదు. బ్రతికి వున్నంతకాలం నీబానిసగా నాచేతపని చేయించుకొని, ఇంతతిండి పారవేయమని ప్రార్థిస్తాను.’

"ఇట్లా అనుకుంటూ తండ్రివద్దకు పోయినాడు. కొంతదూరంనుంచి కుమారుని చూచి, తండ్రి యెదురుగా పరుగెత్తిపోయి, వానినెత్తుకొని ముద్దెట్టుకున్నాడు.

"కుమారుడన్నాడు: 'తండ్రీ! నీకెంతద్రోహం చేశాను. నేను నీబిడ్డ ననుకోడానికి తగను'—అని హృదయ వేదనతో కుమారుడపగలిగిన ఈ[illegible]ంపుమాటలకూ తండ్రి కూడ జవాబేమీ చెప్పలేక పోయినాడు. కాని చెప్పరానంత ఆనందపరవశత్వంలో పడి, వెంటనే తన నౌకర్లను బంపి శుభ్రమైన, విలువైన వస్త్రాలు కుమారునికొరకు తెప్పించాడు. ఆ దినమంతా పండుగదినంగా గడిపినాడు. భోజనవస్తువు లెన్నో తెప్పించాడు. పంచభక్ష్యపరమాన్నాలూ వండించి గొప్పవిందొకటి యేర్పాటు చేశాడు. అంతా సిద్ధమయింది. ఇంట్లో అందరినీ ఒకచోటకు పిలిచి 'ఈ నాప్రియపుత్రుడు, నాబిడ్డ, చనిపోయి తిరిగి ఈరోజున బ్రతికి వచ్చినాడు. దురదృష్టంచేత ఈతనిని గోల్పోయి యెంతైన దుఃఖించాను. తిరిగి యీదినం నా అదృష్టంకొద్దీ దొరికినాడు. కనుక మహదానందంతో మన మీవిందు జరుపుదాము!' అని చెప్పినాడు.

"అందరూ భోజనానికి కూర్చున్నారు. గృహస్థుని పెద్దకుమారుడప్పుడే పొలంనుంచి యింటికి తిరిగి వచ్చాడు. ఇంట్లో జరుగుతున్న అట్టహాసమంతా విన్నాడు.

ఒక సేవకుని పిలిచి ‘ఏమిటీ గోలంతా?’ అని అడిగినాడు. ‘మీరు వినలేదా? ఎప్పుడో యిల్లు విడిచి పోయిన మీతమ్ము డు ఈరోజున తిరిగి యింటికి వచ్చాడు. ఆనంతోషంచేత మీతండ్రిగా రందరినీ పిలిచి విందుచేస్తూన్నారు’ అనిసేవ కుడన్నాడు.

“పెద్దకుమారునికి చాలా కోపంవచ్చింది. ఇంట్లో అడుగుపెట్టలేదు; సింహద్వారంవద్దనుంచే గిరుక్కున వెనుక దిరిగిపోయినాడు. తరువాత తండ్రివద్దకు వెళ్ళి ‘ఎన్నో సం వత్సరాలు నీకుసేవ చేశాను. నీమాట యెప్పుడైనా జవ దాటి యెరుగుదునా? అయినా; నన్నెప్పుడూ నీవు మెచ్చు కోలేదు. నాకెప్పుడూ మంచి తిండైనా పెట్టి యెరుగవు. నిన్ను ధిక్కరించిపోయి, తాగుబోతులతో, దుర్మార్గులతో గూడి పాడైపోయిన వాని గౌరవార్థంగా పెద్దవిందుచేస్తు న్నావు’ అని తండ్రిని నిందించడం మొదలుపెట్టినాడు. అప్పుడు తండ్రిట్లా బదులుచెప్పినాడు: ‘నాయనా, నీ వెప్పుడూ నాతోనే వున్నావుకదా! నీవుమాత్రం నా వాడవుకావా! నాదంతా నీదే! ఇదిగో, చూడు! నాయనా, వీడు నీ ముద్దుతమ్ముడు—చనిపోయి తిరిగిబ్రతికివచ్చాడు. ఇక వీని నెప్పుడైనా చూడగలమనుకొన్నామా? మన అదృష్టంకొద్దీ దొరికినాడు. దీనికి నీవుకూడ ఆనందభరితు డవు కావలెగాని, అసూయ జెందడ మొక్కడిధర్మం?’

"భగవంతుడు కూడ ఇట్లాగే తనబిడ్డల నందరినీ క్రమంగా తనదగ్గరకు చేర్చుకుంటాడు. మనము ముందర వచ్చామా, ఆలస్యంగా వచ్చామా అని చూడడు. నిజమైన ఆత్మపరీక్ష చేసుకొని, ఆత్మశిక్షను పొంది సత్యాన్వేషణ చేసే తనబిడ్డల నందరినీ చేరదీసి కృతార్థులను చేస్తాడు."

---

## 36

జీసస్ ఒకనాడు తనశిష్యుల నడిగినాడు: "నా సందేశాన్ని ప్రజలెట్లా అర్థంచేసుకుంటున్నా రనుకుంటారు మీరు?" శిష్యులిట్లు జవాబు చెప్పినారు: "గురూజీ! 'జాన్' అడవిలో బోధించినదే మీరు చెప్తున్నారని కొందరి వుద్దేశం. 'యెసయా' చేసిన వుపదేశమే మీది కూడా నని కొందరంటారు. 'జెరెమియా' సందేశమూ మీ సందేశమూ ఒకటే కనుక, మీరు నిజంగా మహాత్ములని కొందరి అభిప్రాయం."

"సరేగాని నా సందేశం మీ కేవిధంగా బోధపడినది" ని జీసస్ అడగగా సైమనుపీటరు జవాబిచ్చాడు: "నేనిట్లు అనుకొంటున్నానండీ! భగవంతు డంతరాత్మస్వరూపుడై ప్రతిప్రాణిలో నున్నాడనీ; అందుచేత ప్రతిమానవుడును భగవంతుని బిడ్డడనీ మీ ముఖ్యసందేశం కాదా?" అప్పుడు జీసస్ అన్నాడు: "ఓహో, సైమనూ! నీవు ధన్యుడ

వోయి! నీవు కనుక గ్రహించావు. భగవంతుడు నీలో నుండడంచేతనే నీ కీధర్మం బోధపడిందిగాని ఏమనుష్య మాత్రుడు నీకు దీనిని బోధపరచగలడు? ఈసత్యాన్ని నీలో నీవు దర్శింపగలిగినది నా ప్రభావంవలన గాదు. భగవంతుడే నీకు దానిని చూపినాడు.'' అనిచెప్పి జీసను సంతోషాన్ని వెలిబుచ్చాడు.

ఈసమయాన్నే జీసను శిష్యులకు మరొకవిషయం తెలియపరిచాడు. "జెరుసలేముపౌరులు నన్ను శత్రువుగా చూస్తున్నారు. నాసందేశంలో వాళ్లకు విశ్వాసం లేదు. కనుక జెరుసలేములో నాపై దూషణా, తిరగబాటూ త్వరలోనే రానైవున్నవి. ఇది తప్పదు! వాళ్ళు నన్ను చంపినా చంపగలరు. కాని నాశరీరంమాత్రమే వాళ్ళు స్వాధీనం చేసుకోగలిగేది. నా ఆత్మజీవితాన్ని వాళ్ళు అంట్లలేరు గదా!''

ఈమాటలు విని పీటరు చాలవిచారం వెలిబుచ్చి జీసను చేయిపట్టుకొని "అట్లైతే మీరు జెరుసలేముకు వెళ్లనేవద్దని నాప్రార్థన''న్నాడు. "నీవట్లా అనవద్దయ్యా! నా సందేశాన్ని నెరవేర్చి, తద్వారావచ్చే యెన్ని బాధలకైనా, చావుకైనా నీవు సంసిద్ధుడవు కాలేకపోతే, ధర్మవిజయా న్నెట్లా చేకూర్చగలవు? కేవలం భౌతికమైన నశ్వరప్రపంచంలోనే నీవ్యూహాలన్నీ గిరగిర తిరుగుతున్నా యని తో

స్తుంది. మానవప్రకృతి అనాత్మనే నిత్యమూ పెరిగిస్తూ స్వార్థంకోసకే తంటాలుపడుతూ వుంటుంది. ధర్మజీవనమంటేనే దాని కసహ్యం—తలనొప్పి. ఇంతేకాక ఈశ్వరేచ్ఛను నెరవేర్చడం మాత్రమే జీవితకృత్యంగా చేసుకొని బ్రతికేవాళ్లను లోక మెప్పుడూ బాధపెడుతూనే వుంటుంది. ఉత్తమధర్మంకొరకు బ్రతికేవాళ్లకెప్పుడూ బాధా, కష్టమూ తప్పదు."

పిదప వారత అక్కడ కూడిన ప్రజలను, తనశిష్యులను ఒకచోట చేర్చి జీస సిట్లా చెప్పినాడు: "నాబోధ ననుసరించి యెవరు నడుచుకుంటారో, వారు తమ శరీరసుఖాన్ని పూర్తిగా త్యజించి ఎన్నిబాధలైన సహించుటకు సంసిద్ధులు కావలె. శరీరసుఖ మెక్కడ పోతుందో అని భయంతో బ్రతికేవాడు నిజమైన శాశ్వతసుఖాన్ని పోగొట్టుకుంటాడు. ఎవడు భౌతికసుఖం తనదికాదని విసరివేయగలడో, వాడే నిజంగా ఆత్మజీవనాన్ని కాపాడుకుంటాడు. దేహాత్మలలో దేనికి ప్రాధాన్యత! ఆత్మబలమే—బ్రహ్మబలమేబలమని చెప్పుటకో దగివున్నది. మన మనగా జగద్వ్యాప్తములైన ఆత్మలమే గాని వట్టిశరీరాలము కామని గుర్తింపవలె. ఎవరీ యుద్దేశాన్ని నెరవేర్ప దలుస్తారో వారు దానిని మాటలలో గాక పనులద్వారా నెరవేర్చవలె.*

తిరువాత జీసను ఈకథ చెప్పినాడు: "ఒకని కిద్దరు కుమారులు. ఒకరోజున తండ్రి పెద్దవానితో చెప్పినాడు: 'నాయనా నీ వీ దినం వెళ్లి మనతోటలో పనిచేయవలె!' 'నేను పోన'న్నాడుకుమారుడు. కాని కొంతసేపటికి తనంతట తానే పశ్చాత్తాప పడి తోటకు పోయినాడు. తండ్రి రెండవ కుమారుని కూడ పిలిచి పనికి పొమ్మన్నాడు. 'ఇదిగో, నాయనా! ఇప్పుడే పోతున్నా'నని నమ్మికవుట్టే ట్లు చెప్పినాడు; కాని వెళ్లనే లేదు. ఇప్పుడీ యిద్దరు కుమారులలో తండ్రియొక్క యిచ్ఛ నెరవేర్చిన దెవరో చెప్పండి!" అని జీస సడిగినాడు.

"పెద్ద కుమారుడే" అని శిష్యులు జవాబుచెప్పినారు.

"అవును! ఆవిధంగానే వట్టిమాటలతో, పనికిమాలిన పట్టుదలలతో, మానుషధర్మాన్ని మంటలో గలిపి కాలం గడుపుతూ ధర్మాన్ని అనుష్ఠింప లేకుండే వాళ్లకంటె ముందుగా పాపాత్ములే స్వర్గరాజ్యాన్ని చేరుతారు" అని జీస సన్నాడు.

---

## 37

శిష్యు లొకరోజున జీనసు నడిగినారు: "అయ్యా, మీ వుపదేశాలు చాల కఠినంగా వున్నవి. మీరు చెప్పి నట్లు నడుచుకుంటే మేము నిజంగా సుఖాన్ని పొందగల

మనే విశ్వాసం మాలో వలఅంత దృఢంగా లేదు. అది మీరే మాలో కలిగించవలె."

"ధర్మజీవనంవల్ల వచ్చే ఫలిత మేమనిక దా మీసందేహం? విశ్వాసియొక్క జీవితంలో ప్రతిఫలాపేక్షకు చోటే లేదు. జీవితపరమార్థ మేమో స్పష్టంగా తెలుసుకొనడమే విశ్వాసముయొక్క అంతరార్థమూ, దాని పరియవసానమును. మీమనస్సు, వాక్కు, కర్మ—జీవితమంతా కూడ భగవంతునిదే అని మీరు తెలుసుకుంటే ధర్మజీవితంయొక్క ఫలిత మేమున్న ఆతురతయే మీకుండదు. సేవకుడు తన విధ్యుక్తాన్ని నెరవేర్చినందుకు యజమాని అతనిని అభినందించవలసిన పని లేదు. సేవాతత్పరతయొక్క రహస్యం తెలుసుకున్న సేవకుడు యజమానియొక్క మెప్పుకొరకు వేచివుండడు. అట్టిఫలితం రాకపోతే, యజమాని మీద కోపగింపడు. తనపని యేదో తాను నమ్మకంతో నెరవేర్చినట్లయితే, ఎంత ఫలితానికి తనకు పాత్రతవుంటే అంతే వస్తుందని అతడెరుగును. కనుక నిశ్చింతతో నుండగలడు. మీరందరు కూడ అటువంటి సేవకులమని గుర్తెరిగి, భగవదిచ్ఛను నెరవేర్చవలె. ప్రతిఫలాపేక్ష లేకుండ మీ విధ్యుక్తాన్ని నెరవేర్చి, యేదివస్తే దానితో సంతృప్తిపొందండి. మనకీయబడ్డ అమూల్యమైన ఆత్మజీవనం మాత్రం ధ్వంసమైపోకుండ చూచుకొనడమే ముఖ్యవిధి. అనుక్షణమూ

యజమానిరాకకు, పరీక్షకు సంసిద్ధులై మీపని మీరు నెర వేర్చవలె. యజమాని యెప్పుడు వచ్చిపరీక్షిస్తాడో—ఇప్పు డా, తరువాతనా?—అనే ఆతురత సేవకుల కక్కరలేదు. అన్నివేళల అతని సమక్షాన్నే మనం బ్రతుకుతున్నామనే భావమే మనలో నిండి వుండవలసినది. ఎల్లప్పుడూ మను ష్యుడు ఈశ్వరేచ్ఛను నెరవేర్చుచుండవలెనే గాని, ముం దెప్పుడో యెక్కడో యేదో చేయవచ్చు ననుకుంటూ కూ ర్చుంటే, జీవితమే వ్యర్థమైపోతుంది.

"అందుచేత మనుష్యు డెప్పుడూ ఆత్మదృష్టితో 'ఇప్పుడు నావిధికృత్య మేద'ని ప్రశ్నించుకుంటూ, మెలకు వతో బ్రతకవలె. ఎప్పటిపని అప్పుడే పూర్తిగా నెరవేర్చ వలసిందే గాని, భూతభవిష్యత్తులను గూర్చి శుష్కాలో చనలయందు కాలం పుచ్చకూడదు. అప్పటి కేది కర్తవ్య మో దానిని పూర్ణవిశ్వాసంతో నిర్వహించుటే విధా యకం. ఆత్మజీవనానికి కాలంయొక్క నిర్బంధంలేదు. తా పుడు, తిండిపోతుతనం, సంసారతాపత్రయం—వీటిలో బడి మీశరీరాలను మరచి ప్రమత్తులు గాకండి! భయంకర మైన జీవితభారం కిందబడి నలిగి పోకండి! జీవనయాత్రలో శరీరంమీద ఆత్మకు సంపూర్ణాధికార మియ్యవలె". నని జీనసు బదులుచెప్పినాడు.

# 38

మనుష్యుని జీవిత మెట్లా వుండవలెనో నిరూపించ
డానికి జీసను మరొకకథ చెప్పినాడు.

"ఒకడొకతోట వేశాడు. దానికి కావలసిన యెరు
వు, నీటివసతి మొదలైన యేర్పాటులన్నీ చేసి ఫలవంతం
గా చేశాడు. కొందరు వ్యవసాయకులను పిలిచి తోటను
వాళ్లకు బాడుగ కిచ్చాడు. తోటను బాగా పండించి కొం
తసొమ్ము తన కిచ్చేటట్లు వాళ్లతో ఖరారుచేసుకున్నాడు.
పంటకాలం వచ్చింది. తనకు రావలసిన సిస్తు తీసుకొని రా
వలసినదని తోటయజమాని తన సేవకుని బంపినాడు. తోట
కాపరులు తోటను తామొకనివద్ద కౌలుకు పుచ్చుకున్నా
మనీ; తోటను వేసి పెంచి వృద్ధిచేసినవాడు మరొకడున్నా
డనే విషయమే మరచిపోయినారు. తోట బాగా పెరిగి
పెద్దదైనతరువాతనే తనువద్దకు వచ్చినా డనే సంగతిని
వాళ్లు లెక్కచేయలేదు. తా మియ్యవలసిన దేమీలేదని
చెప్పి వచ్చినసేవకుని వెళ్లగొట్టినారు. తోటపై సర్వాధి
కారం తమదే నన్నట్లుగా, కాపురం కూడ తోటలోనే
బెట్టి, కదలక కూర్చున్నారు. తరువాత యజమాని తన
గుమాస్తాను పంపినాడు. మొదట చేసుకొన్న షరతుప్రకా
రం తనపాలు తనకు వచ్చితీరవలె నని తోటపనివాళ్లతో
చెప్పమన్నాడు. ఈసారికూడ తోటకాపరు లదే విధంగా
యేమీ యియ్యకుండా, గుమాస్తాను కూడ తిప్పి పంపివే

శారు. మూడవసారి తోటఆసామియొక్క కుమారుడే వచ్చాడు. చేసుకొన్న నిర్ణయంప్రకారం డబ్బిమ్మని గట్టిగా అడిగినాడు. తోట వాళ్లతనిని చంపివేశారు.

"ఈసందర్భంలో తోటయజమాని యేమి చేయవలె? తనతోటలోనుండే పనివాళ్ళను తప్పించి తోట మరొకరి కిచ్చివేయడమే కర్తవ్యంకాదా?

"భగవంతుడే తోటయజమాని; ఈప్రపంచమే తోట; మానవులే తోటసేద్యంచేసి ఫలింపజేసే పనివాండ్లు; విశుద్ధమైన ఆత్మజీవనమే తోటవాళ్ళు చెల్లించవలసిన మరతుసొమ్ము. మనుష్యుడు బ్రతుకవలసినది ఆత్మకొరకు గాని శరీరసుఖంకొరకు కాదని ప్రపంచానికి పదేపదే జ్ఞాపకంజేసే మహాపురుషులే తోటయజమానిచే పంపబడిన దూతలు!

"సన్మార్గం తప్పి నడిచే అంధప్రాయులు విశ్వకర్త యొక్క పనిని నెరవేర్చుటకు గాక స్వార్థసంపాదనకొరకే జీవితం మీయబడ్డ దనుకుంటారు."

# 39

తరువాత జీసస్సొకసారి జెరుసలేముకుపోయి గుడిలో గుమిగూడిన ప్రజలతో పరసీయులయొక్క అక్రమ జీవితాన్నిగూర్చి చెప్పినాడు.

"తామే ధర్మపరాయణులు మని, మతగురువుల మని, పవిత్రుల మని చెప్పుకునే శాస్త్రపండితులు మీకెన్నో దుర్బోధలుచేస్తారు,—జాగ్రత! భగవంతునిగూర్చి యేమి చెప్పుటకుగాని పూర్ణాధికారం, అర్హత, వాళ్ళకు మాత్రమే వున్నట్లు గర్విస్తారు. వారి ధర్మచింతంతా వట్టి మాటలతోనే సరిపోతుంది. తాము చెప్పేదానిని మాత్రం ఎప్పుడూ చేయరు. గురుత్వాధికారం మాత్రం దొక్క-టుంటే వాళ్ళకు చాలును. కనుకనే ఆడంబరంగా తమ గొప్ప తామే చాటుకుంటారు. పెద్దపెద్ద బిరుదులు తగిలించుకొని యెంతో అట్టహాసం చేస్తారు! నిజంగా ఉపయోగించే పనిని దేనినీ తాకరు. ఇక వాళ్ళను నమ్ముకొని యేమిచేయవలె?—ఎట్లా తరించవలె? తానే గురువునని చెప్పుకొనడం కృతఘ్నతా మహాపాతకమని జ్ఞప్తియందుంచుకోండి! బాహ్యకర్మలద్వారా, మొక్కులు, ముడుపులద్వారా మనుష్యుడు భగవంతుని చేరగలడనే అజ్ఞానమే వారిపట్టుగొమ్మ. బాహ్యాడంబరాలతో యేమీ పనిలేదనియు, అంతరాత్మ ఒక్కటేకావలసిన వస్తువనియు వాళ్లెరుగనే యెరుగరు. సులభమైన పైపై సాధనలన్నీ తు, చ, తప్పకుండ చేస్తారేగాని ఏది వుత్కృష్టమో, యేది నిజంగా ఆవశ్యకమో అనే ఆలోచన వారి కక్కర లేదు. ప్రేమ, దయ, సత్యం—ఇవి వారి ధర్మనిఘంటు

వులో లేనిమాటలు. పైకట్టుబాట్లను మాత్రం బాగా గమనించి వాగాడంబరంద్వారా ఇతరుల నందరినీ ఉచ్చు పన్ని మోసంలో పడవేస్తారు. అందుచేతనే వాళ్ళను శవాలను మోసుకొనివెళ్లే పెట్టెలతో సరిగా పోల్చవచ్చు. వాటివలెనే వాళ్ళుకూడ పైకెంతో శుచిగానూ, డాబుగానూ కనిపిస్తారు. కాని లోపలమాత్రం మంతా కల్మషమే—అసహ్యమే.

హతసాక్షులైన మహాత్ములకు, లోకంతోపాటు వీరుకూడ బాహ్యగౌరవం మాత్రమిస్తారు. కాని అసత్య పిశాచంతో ఘోరయుద్ధం చేసి జీవితాలర్పించిన మహాపురుషులనూ, దేవదూతలనూ బాధించేది, ఆపైన ప్రాణం తీసేదీ వీళ్ళే! ఇప్పుడూ యెప్పుడూగూడ యెల్లచోట్లా ధర్మానికీ, మంచికీ పరమశత్రువులు వీరే! వీళ్ళెప్పుడూ మంచిని అణచిపెట్టి చెడుగునే మంచిగా కనిపింపజేస్తారు. అదే యితరులకు బోధిస్తారు. అందుచేత ప్రపంచంలోని చెడుగంతకూ వీరి బోధనలే, వీరిచేష్టలే కారణం. ఇదిచాల భయంకరస్థితి! ప్రపంచంలో మరి యేతప్పైనా దిద్దవచ్చుగ్గాని, మంచినే చెడుగుగా మార్చివేసే తప్పుమాత్రం దిద్దబడదు. ఇదే ఆత్మవంచకులైన ఈమతబోధకులు చేసేపని."

జీసస్ ఇంకొక విషయం చెప్పినాడు. "జెరుసలేము నివాసు లందరూ పరస్పరప్రేమతో సేవాపరాయణు

లయ్యేలట్లు, వారి సందగిసీ ఒకటిగా చేయవలెనని తలచి నాను. కాని ధర్మంకొరకు, లోకక్షేమంకొరకు పనిచేసే వాళ్ళను చంపడం తప్ప వేరికి మ రేమీా తెలియడంలేదు.''

ఈనగాటంలో గుడివిడిచి జీసను వెళ్ళిపోతూ "నిశ్చ యంగా చెపుతున్నాను! ఈగుడి, దాని చిత్రశిల్పంతోనూ, సమస్త అలంకారాలతోనూ, హావ్రు రేఖలు లేకుండ ధ్వంసం కానున్నది! దీని కతీతమై, పవిత్రమైన విశ్వేశ్వ రాలయ మొకటిమాత్రి మున్నదని నమ్మండి! స్వర్గీయ మైన ప్రేమామృతంలో బ్రతికే ఈశ్వరరారాధకుల హృదయసీమయే ఆయాలయము. ఈశిధిలగృహంయొక్క పాడుదిబ్బమీాదనే ఆ ప్రేమమందిరంయొక్క నూతన నిర్మాణం.''

ఆసాతనాయు మెప్పుడు ప్రతిష్ఠింపబడుతుం దని జీసనును పరిజ లడిగినారు. దానికి జీన సిట్లన్నారు. "అది యిప్పట్లో సాధ్యపడదు. నాసందేశాన్ని గూడ యితరులను మోసపుచ్చేటందు కేమనుష్యులుపయోగిస్తారు. ఈమోసం వల్ల ప్రపంచంలో ఎంతోకలవరమూా, ఎన్నోయుద్ధాలూా కూడ జరుగగలవు. ప్రపంచం ప్రేమవిహీనమై, అరాచ కం ప్రబలుతుంది.

"కాని ఈసందేశంయొక్క సత్యం ప్రతివారికి

యెప్పుడర్థమౌతుందో, అప్పుడే ప్రలోభనాలూ తద్వారా పుట్టే చెడుగూ నశిస్తాయి."

# 40

జీసను నెట్లాగైనా చంపుదామని పరసీయులూ, శాస్త్రపండితులూ చాల ప్రయత్నించారు. అందరూ సభచేసి చర్చచేశారు. ఈపని యెట్లా నెరవేర్చడమని దీర్ఘాలోచనలు చేశారు. "ఇతని ఆగడ మింక సాగనీయ కూడదు. ఇతనిబోధ ప్రజలలో చాల ఉద్రేకం పుట్టిస్తున్నది. ఇట్లాగే విడిచిపూరకుంటే, ప్రజలలో ఇతనియెడల చాల నమ్మకం యేర్పడి ప్రమాదం కలుగుతుంది. మన మతవిశ్వాసాలన్నీ అడుగంటిపోతవి. దేశంలో సగంమంది యిప్పటికే ఇతనిఅనుచరులైనారు. మనుష్యులందరూ భగవంతునిబిడ్డలని, కనుక అందరూ సోదరులని, జాతిభేదం పాటించడం పాపమని, ఇతరజాతులలోకంటె యూదులలో ప్రత్యేకఘనత యేమీలేదని బోధిస్తున్నాడు! చూచారు కదా! ఈబోధలువిని, తద్వారా మనదౌర్బల్యం తెలుసుకొని, రోమనులు మొదలైన విదేశీయులు మనపైకి దండెత్తిరాగలరు. ఇక మనరాజ్యం, మనప్రతిభ అంతరించిపోతుంది!"

పరిసీయులూ, శాస్త్రపండితులూ ఈవిషయాన్ని గూర్చి చాలా సేపు తీవ్రచర్చ చేశారు. ఎట్లాగైనా జీససును చంపివేస్తేనే గాని వీడవదలిపో దనుకున్నారు. కాని ప్రజల అభిప్రాయం తమకు వ్యతిరేకంగా వున్నదని కొంతమంది భయపడ్డారు. కనుక సాహసించి అతనిపై చేయి వేయలేక పోయినారు.

అప్పుడు వాళ్ళు ప్రధానమతపీఠాధిపతితో సంప్రదించారు. అతని పేరు 'కైఫాస్', అతడన్నాడు: "మీ కింతభయ మెందుకు? జాతిగౌరవమూ, ధర్మమూ రక్షించడానికి ఒక్కొక్క కార్యాన్ని చేయవలసి వస్తుంది. ఇప్పుడీ మనిషిని నాశనం చేయకపోతే, మన జాతే పూర్తిగా నిర్మూలమైపోతుంది. నాశనం కాకపోయినా, అనేక కొట్లా కలహాలూ, కేసులూ పుట్టి ప్రజలంతా చెలరేగి ఒకరి నొకరు చంపుకుంటారు. చాలామంది మిగిలినవాళ్ళు మన పురాతనధర్మాలన్నీ విడిచిపెడతారు. అందుచేత మన మేలాగైనా జీససును చంపించితీరాలి! సందేహించిగాని, భయపడిగాని వెనుకంజ వేయగూడదు."

కైఫాస్ ఇల్లాచెప్పగానే పరిసయ్యులూ, శాస్త్రులందరూ ఉప్పొంగిపోయినారు. జీససును చంపటానికే అందరూ కలిసి నిశ్చయించేశారు. అవకాశం దొరికితే, అతనిని పట్టుకొనేవాళ్ళే. కాని అతను [illegible] [illegible]

లో లేదు. ఎక్కడుంటాడోసరిగా వాళ్ళకు తెలియనూ లేదు.

'పాసోవరు' పండుగ అప్పటి కింకా ఆరుదినాలుం దనగా, జీసస 'మనము జెరుసలేముకు పోవలె' నని తన శిష్యులతో అన్నాడు. మతబోధకులందరూ కుట్రచేసి అతనిని చంప నిశ్చయించినారని శిష్యులకందరికీ తెలుసును. జెరుసలేముకు పోవద్దని అతని నందరూ బ్రతిమాలినారు. "ఇక్కడి మతబోధకులు మిమ్ము చంప నిశ్చయించారు. మీరా రక్కడకు వెళ్ళినట్లైతేమాత్రం తప్పక ప్రమాదం కలుగుతుంది." జీసస జవాబుచెప్పినాడు: "చీకటిలో నడిచేవాడుమాత్రమే దారి కనబడక తూలిపడిపోతాడు; కాని పట్టపగటివెలుగులో పోయేవాని కేమిభయం? ఆత్మ జ్యోతియొక్క వెలుతురులో జీవితంగడుపుతూ, భగవదాజ్ఞను శిరసావహించేవాడు పాపం చేయగలడా? అతని కే భయములూ లేవు. కనుక మీరు జెరుసలేముకు రండి! మనకు భయమెందుకు?"

ఈమాటలువిని యేమిచెప్పుటకును శిష్యులకు తోచ లేదు. జీససుమాట కెదురుచెప్పలేక అతనివెంట అందరూ బయలుదేరినారు.

---

## 41.

జీసస జెరుసలేముకు వస్తున్నాడని తెలియగానే

ఆ పూరుప్రజలు ఆయనరాక కెదురుగా వెళ్లి కలుసుకు
న్నారు. అతని నెంతో గౌరవించి గుఱ్ఱంమీద యెక్కిం
చారు. చెట్లఆకులు కోసి గౌరవ చిహ్నంగా బాట
నిండ విరజిమ్మి అమితానందంతో ఆయనముందు
పరుగెత్తుతూ "ఇదుగో! నిజంగా మారాజు ఇతడే!
భగవంతుడంటే యేమో మాకు చెప్పిన దీయనే!" అం
టూపోయినారు. కొంతసేపటికి జీసను జెరుసలేము ప్రవే
శించాడు. "ఎవరయ్యా, యితడు!" అని అడిగేవాళ్ళు
కొందరు. "ఇతడే జీసను! గెలిలీలో నజరెతునుంచి వచ్చిన
ప్రవక్త" అని చెప్పేవాళ్లు కొందరు. ఇట్లా వారిలో
వారే చెప్పుకుంటూ ముందు నడిచిపోతున్నారు. అన్ని
చోట్లనుంచీ వందలకొలది మనుష్యులు వచ్చి జీసనుచుట్టూ
చేరుతున్నారు. ప్రజలగుంపు అంతకంతకు చాల పెద్దద
యింది. గుడిదగ్గరకు రాగానే జీసను గుఱ్ఱందిగి లోపలికి
పోయి, అక్కడ చేరినప్రజలకు హితబోధ ప్రారంభించా
డు. ఇది చూచి మతగురువులూ పరసీయులూ "చూడండి
చూడండి! ఏమి చేస్తున్నాడో చూడండి! తిరిగి వచ్చిందే
దో వుట్టిమూలక! ప్రజలందరూ వానివెంట ఎట్లా పడిపోతు
న్నారో చూచారా?" అని తమలో తాము గుసగుస లా
డుతూ చెప్పుకోవడం మొదలుపెట్టినారు.

వీళ్లైతే తక్షణమే జీసనును యెట్లాగైనా పట్టుకొని

చంపడానికే సంసిద్ధులై వచ్చారు. కాని ధైర్యం చాలలే దు. జీసనుపక్షం వహించి ప్రజలు తమమీద తిరగబ డతా రని భయపడ్డారు. ప్రజలను రెచ్చగొట్టకుండ అత నిని కడతేర్చేమార్గ మేదని చాలా యోచించారు.

జీసను మన స్సేమాత్రమూ చలింపలేదు. ఏవిధ మైన సంశయం, తొట్రుపాటు లేకుండా, తనచుట్టూ యే కుట్ర జరుగుతున్నదో లెక్కైనా చేయకుండ, నిర్భయం గా తన ధర్మబోధను సాగిస్తూనే వున్నాడు. అప్పుడు గుడి లో యూదులు మాత్రమే కాదు, అన్యమతస్థులైన గ్రీకులు కూడ వున్నారు. జీసనుసందేశ మొక్క యూదులకు మా త్రమే గాక మానవు లందరికీ కావలసిందే యని విని గ్రీ కులుకూడా వచ్చినారు.

ఇట్టి సదుద్దేశంతో వచ్చినా, గ్రీకులను జీసనుకు చూపడానికి శిష్యులు చాలా భయపడ్డారు. యూదులకు ను, విజాతీయులైన గ్రీకులకును నడుమ యెట్టి భేదాలూ వుండరా దనిన్ని, అందరూ కలిసి ఒక్క పెద్ద ఈశ్వరకు టుంబమునకు జెందినవారే యనిన్ని చెప్పిన జీసను బోధ యెడల యూదులు విముఖులై యున్నారనీ అతనియొక్క శిష్యులకు బాగా తెలుసును. ఈస్థితిలో గ్రీకులను గౌర వించి తెచ్చి, జీసనుకు చూపడానికి వాళ్ళు చాల భయప డ్డారు. అందుచేతనే గ్రీకు లే సదుద్దేశంతో వచ్చారో,ఆవి

విషయాన్ని గూడ మొదటనుంచీ జీసస్‌తో చెప్పకుండ అణచిపెట్టి వుంచారు. కాని చివరకు గ్రీకుల కోరిక మీద వారి రాకను గురించి అతనికి తెలిపినారు.

గ్రీకులు తన అనుచరులు కావడానికి అభిలషిస్తున్నారని విని, జీసస్ మొదట ఆశ్చర్యపడ్డాడు. యూదులకూ మిగతా జాతులకూ భేదం లేదని చెప్పడంవల్ల యూదులకు తనమీద చాలా ఆగ్రహం వస్తుందని అతనికి తెలుసును. కాని వెంటనే తేరిపార చూచాడు: "నిజమే! యూదులకూ మిగిలిన జాతులకూ యేమీన్ని భేదం లేదు. నే నందరిలోనూ వున్నాను. నాకందరూ సరిసమానులే! నే నీమాట అన్నందుకు నన్ను చంపుతారని కూడ విచారించను. నా సందేశాన్ని గుర్తించి, భగవంతుడు ప్రతిజీవియందునూ ఉన్నాడనీ, అందరిలోనున్న భగవంతుడొక్కడే యనీ, విశ్వాసంతో బ్రతికే సమయం వచ్చింది. మంటిలో బడ్డగింజ తన శరీరాన్ని నశింప జేసుకున్నప్పుడే మొలకెత్తి, చెట్టై, ఫలిస్తుంది. అట్లాగే మనుష్యుడుకూడ భగవత్సేవలో తన జీవితాన్ని పూర్తిగా అర్పించినప్పుడే పూర్ణమైన జీవితఫలం పొందగలడు. శరీరాన్ని మాత్రమే కాపాడుకునే వానికి ఆత్మజ్ఞానం నశించి నశించిపోతాడు. ధర్మంకొరకు శరీరాన్నిచ్చివేసేవాడు మాత్రమే ఆత్మోపలబ్ధి పొందుతాడు.

"నాలో యిప్పు డొక గొప్ప సంగ్రామం జరుగు తున్నది. నశ్వరప్రపంచానికి సంబంధించిన శరీరానికి దాస్యం చేయవలసిందా? లేక, ఏమైననూ, సమస్తం అర్పించి భగవత్సేవ చేయనా?—ఇదే యిప్పుడు నాలోనున్న సందిగ్ధస్థితి. కాని ఏ మహోద్దేశంతో భగవంతుడు నాకీ జీవితమిచ్చాడో ఆవుద్దేశాన్నే, దీక్ష బూని, నిర్భయంగా నెరవేర్చవలసిన ఈ వుత్కృష్టసమయంలో 'ఓతండ్రీ! నా ధర్మమునుంచి, నా విధికృత్యాలనుంచి నన్ను విడిపించు' మని భగవతుని అడగవచ్చునా? ఛీ! ఆ దౌర్బల్యపుమాట నే ననలేను! తండ్రీ, నాకు నీ ప్రత్యక్షదర్శన మియ్యవోయి! తద్వారా నా పుత్రత్వాన్ని జయపెట్టి సార్థకం చేసుకొని నీవేరిట మానవులను ఏకకుటుంబంగా చేసి కృతార్థుడ నౌతాను."

అది విని యూదు లన్నారు: "ఎప్పుడో క్రీస్తుప్రవక్త తప్పక అవతరింపవలె నని మేముమాత్రం యెరుగ మా! కాని మనుష్యుని పుత్రత్వాన్ని జయపెట్టడమంటే మా కేమీ బోధపడలేదు."

జీసను జవాబు చెప్పినాడు: "మనుష్యుని పుత్రత్వానికి విజయం చేకూర్చడమంటే ఆత్మజ్యోతియొక్క వెలుగులో బ్రతకడమే! ఆ వెలుతురు మనలో ప్రతివానిలోనూ వున్నది. భగవంతుని అంశ ప్రతివానిలోనగా వున్న దంటే

మానవుని ఒక ఆత్మస్వరూపిగా గ్రహించి, వానిని భౌతిక ప్రపంచానికి పైగా యెత్తి గౌరవించడ మనే అర్థము. నా సందేశరహస్యాన్ని మొదట సమ్మతాగా వారి విశ్వాసానికి లక్ష్యం నేను కాను,— భగవంతుడే. అతడే ప్రతి వానిలో నా జీవనంతోడై వుండి ప్రవాహానికి ప్రాణశక్తి నిచ్చేవాడు. నా ద్వారానే వచ్చినవారే పరమాత్మయొక్క స్వభావాన్ని కాపాడగలరు. అందుకే నా, ప్రపంచానికి నిజమైన జ్ఞానమిచ్చే పరమాత్మ వారిలో గూడ వున్నాడు గదా. ఎవరైనను నా మాటలను మాత్రమే విని, విన్నదానిని అర్థంచేసుకోలేకపోయినా, వారి హృదయంలో నిందార్హులు కారు. తెలియలేక ఆత్మసాధన ద్వారా ఆత్మగుణాలు దారి మార్చుటకే నేను వచ్చినది. ఈసందేశమే భగవంతునిది— నాది కాదు! దీనినిమొదలనిర్లక్ష్యంచేసేవాడు భగవద్ద్రోహి. ఆపరమాత్మయే నాలోనుండి దీని కంతకూ సాక్ష్యమిచ్చు చున్నది. నేనుచెప్పేదంతా నేనాపరమాత్మనుండివిన్నదే!"

ఇట్లా చెప్పి జీసస్ వెళ్ళిపోయాడు. మతబోధకు లెవ్వరూ అక్కడ కనిపించలేదు.

## 42

జీసస్ మాటలు వినగా వినగా చాలమంది ధనికు లకు, కొంత పేరుప్రతిష్ఠలు కలిగిన వాళ్ళకు కూడ అతని

ధర్మసందేశంలో చాలనమ్మకం కలిగింది. కాని పరసీయు లముందర బహిరంగంగా తమవిశ్వాసాన్ని వెలిబుచ్చడానికి భయపడ్డారు. పరసీయులలో యెవ్వరికీ జీసనుమీద నమ్మకంలేదని వారికి తెలుసును. ఎప్పుడూ మనుష్యుల బూటకపుమాటలనే గాని, భగవంతుని పవిత్రవాణిని వినడం వాళ్లకలవాటులేదు. కనుకనే జీసనుమాటలు వాళ్లకు రుచించలేదు.

మతగురువులూ, శాస్త్రపండితులూ తిరిగికైఫాసు యొక్క కచేరీలో చేరి సభచేశారు. జీసనునురహస్యంగా పట్టుకొని చంపడమెట్లాగని యోచనచేశారు. బహిరంగంగా పట్టుకొనుట కిప్పటికప్పుడే భయపడుతున్నారు. జీసను వద్ద మొదటచేరిన శిష్యులలో 'జూడాస్ ఇస్కారియుటు' ఒకడు. అతడుకూడ మతగురువుల సభకు హాజరైనాడు. తానుకూడ సభలో మాట్లాడుతూ, "మీరు జీసనును ప్రజల యెదుట బహిరంగంగా పట్టుకోలేకపోతే, కొద్దిమందితో అతడు కలిసివుండే సమయం కనిపెట్టి, నేనే వచ్చి మీకు చెప్తాను. అతడుండే చోటూ పట్టుకునే విధమూ మీకు చూపిస్తాను. అయితే మీరు నాకేమిస్తారో చెప్పండ"న్నాడు. ముప్పదివెండినాణెము లిస్తామని ఖరారుచేశారు. జూడాసుకూడ సమ్మతించాడు. ఆక్షణం మొదలుకొని జీసనును ఎక్కడ యెట్లా పట్టుకొని అప్పజెప్పడమాయని తీవ్రాలోచనలో మునిగిపోయినాడు.

ఈలోగానే జీసస్ తిరిగి జెరుసలేము విడిచి వెళ్ళి పోయినాడు. శిష్యులనుమాత్రం తనవెంటనుంచుకున్నాడు. పండుగ మొదటిదినం వచ్చింది. శిష్యులు జీసస్ నడిగారు: "అయ్యా 'పాసోవరు' పండుగ మన మెక్కడ చేసుకుందాము?" "ఎక్కడనా? ఒకపల్లెటూరు చేరండి! మన కొక చోటేమిటి?—ఒక గృహస్థుని యింటికిపోయి, మీయింట్లో మమ్మల్ని పండగ చేసుకోనియ్యండని యింటివానినడగండి." అని జీసస్ జవాబు చెప్పినాడు. జీసస్ ఆజ్ఞప్రకారం శిష్యు లట్లాగే చేశారు. వారితో జీసస్‌కూడ కలిసివెళ్ళినాడు. ఒకపల్లెటూరు చేరి ఒకరి యింటికి పోయినారు. వారిని చూడడం తడవుగా, ఇంటియజమాని ఆదరభావంతో వారి నాహ్వానించి ఆతిథ్యమిచ్చాడు.

జీసస్, తన పన్నెండుగురు శిష్యులూ (జూడాసుతోసహా) భోజనానికి బల్లచుట్టూ కూర్చున్నారు. జీసస్ మతబోధకులకు అప్పజెప్పి ప్రాణం తీయించడానికి జూడాసు సంసిద్ధంగా నున్నాడని, వాండ్లతో [illegible] కూడ చేసి వచ్చాడని జీసస్ తెలుసుకొన్నాడు. కాని తన శిష్యుని—మిత్రుని—ద్రోహచింతకు తిరిగి కఠినమైన ప్రతీకారం చేయడ మాయన కేమాత్రమూ ఇష్టంలేకపోయింది. ఉత్కృష్టప్రేమతత్వాన్ని ఎప్పుడూ అందరికీ ఉపదేశించడమే తనకర్తవ్య మనుకొన్న జీసస్ [illegible]

మాత్రం మరొకవిధాన మెట్లవలంబిస్తాడు ? ప్రేమచేతనే
జూడాసుహృదయాన్ని తాకవలెనని తలచినాడు.

తానూ తన శిష్యులందరూ కలిసి బల్లచుట్టూకూ
ర్చునివుండగా, ఒకరొట్టె తీసి దానిని పన్నెండుముక్కలు
చేశాడు. వాటిని శిష్యులొక్కొక్కరికే యిస్తూ "ఇదేనా
శరీరమని మీరు గుర్తించండి! ఇదితీసుకొని తినండ"న్నా
డు. ద్రాక్షరసంకొంత గిన్నెలో నింపి దాని నొక్కొక్క
నికేఅందిచ్చి, "ఇదిమీరు తాగవలె!ఇదేనారక్తమ"న్నాడు.

ఒకరితరువాత నొకరు రొట్టె, గిన్నె తనవద్దకు
వస్తూవుంటే, జీసను విపరీతపుమాటల కాశ్చర్యపడుతూ,
అతడిచ్చిన ఆజ్ఞప్రకారం చేశారు. అప్పుడు జీస సన్నాడు:
"ఏమంతాశ్చర్యం మీకు? అవును! ఇది నిశ్చయంగా నా
రక్తమే! ఈప్రపంచంలోని పాపాలకొరకుగాను నారక్తాన్ని
నేను ధారబోయ సంకల్పించాను." ఈ మాటలంటూనే
బల్లదగ్గరనుంచి లేచి, తనవంటిపైనున్న పెద్ద అంగరకాను
విప్పి, చిన్న అంగవస్త్ర మొకటి మొలకుచుట్టుకొని, నీళ్ల
కూజా ఒకటి చేత బుచ్చుకున్నాడు. తన శిష్యులందరి పా
దాలూ తానే కడగవలెనని చెప్తూ, మొదట పీటరువద్ద
కువచ్చాడు. అది చూచి పీటరు ఉలికిపడి పక్కకు తొలిగి
"అయ్యయ్యో! ఉత్తమోత్తముడవు! గురునరేణ్యుడని
పూజించు కుంటున్నామే! నీచేతనా, మేము కాళ్ళు కడిగిం

చుకోవలె? ఏమిటీ పాపం! అయ్యో—" అని యెంతోనొ
చ్చుకుంటూ దూరంగా పోయినాడు. అప్పుడు జీస న్నా
డు: "ఇది మీకాశ్చర్యంగా వుండవచ్చు. కాని నేనిట్లా
యెందుకు చేస్తున్నానో త్వరలోనే మీకు తెలియగలదు.
మీలో మీరందరూ నిష్కల్మషుల మనుకొన్నా, అంద
రూ పవిత్రులు కారని నేనెరుగుదును. అందుకే నేనీ పని
చేసేది!"

జూడాసును మనస్సులో నుంచుకొనే జీసను ఈమా
టన్నాడు.

ఇట్లా జీసను తనశిష్యులందరి పాదాలూ—జూడా
సుకాళ్ళుకూడ—కడిగినాడు. కాళ్ళుకడిగి తిరిగి అంగరకా
వేసుకొని శిష్యులను సంబోధించి "ఇప్పుడు తెలిసిందా
మీకు, ఇట్లా యెందుకు చేశానో? మీలో మీరుకూడ
ఒకరి కొకరిట్లా సేవ చేయుటకు సంసిద్ధులై, పరస్పర ప్రేమ
నూ బాధ్యతనూ గుర్తించవలె సుమా!" అనిచూపడానికే
నేనీపనిచేస్తిని. మిమ్ము హింసించే వాళ్ళయెడల, ద్రోహు
లయెడల, చాటునుండి గొంతుకోసే హంతకులయెడల
కూడ మీరట్లా నడుచుకోవలెనో తెలుపుటకే నే చేసిన
పనియొక్క ఉద్దేశము. మీరిది బాగా గ్రహించి, అట్లా
బ్రతుకగలిగితే ధన్యులౌతారు."

ఈమాటలు చెప్పిన వెంటనే, జీసనుమనస్సు విచా

రంతో నిండిపోయింది. కృపాపాత్రుడైన జూడాసునుగూ
ర్చినవార్తతో హృదయాందోళన కలిగింది. "ఔనౌను,
నేనీపూట కాళ్ళు కడిగిన వారిలోనే నిశ్చయంగా వొకరు
నాకు ద్రోహంచేయనున్నారు!" అని జీసస నేసరికి, శిష్యు
లొకరివంక నొకరు చూచుకొనడం మొదలుపెట్టినారు.
జీసను యెవరి నుద్దేశించి అంటున్నాడో యింకనూ తెలి
యలేదు. ఒకడుమాత్రం జీసనుప్రక్కనే కూర్చున్నాడు.
జీసను ఎవరినుద్దేశించి అట్లన్నాడో అడిగి తెలుసుకోమని,
దగ్గరగా కూర్చున్న వానికి పీటరు దూరంనుంచి సంజ్ఞచే
శాడు. అప్పుడు జీసను జవాబిచ్చాడు: "ఇదిగో, తిరిగి
యిప్పుడు నేనెవరికి రొట్టెముక్క నిస్తానో అతడే యని తె
లుసుకొనండి" అని చెప్పి రొట్టెఒకటివిరిచిజూడానుచేతికంది
స్తూనే "ఏమబ్బాయీ! నీవు చేయదలచుకొన్న పని త్వర
గాచేయరాదా? ఇంత ఆలస్యమెందుకు?" అన్నాడు. మొ
దట ఈమాటల కర్థమెవ్వరికీ తెలియలేదు—జూడాసొక్క
నికి తప్ప. రొట్టె నందిపుచ్చుకొని, చివాలున లేచి రెప్పపా
టులో బయటకు పోయినాడు. జూడాను తలపెట్టిన కార్య
మేటువంటిదో, మిగిలిన శిష్యులు కొంతబోధపరుచుకునే
సరికి జూడాను పారిపోయినాడు. పరుగెత్తి పట్టుకోడానికి
కాలంమించింది. రాత్రిసమయం—బాగా చీకటిగమ్మింది
కన్ను కనిపించని కటికచీకటిలో లీనమైపోయిన వ్యక్తిని

ఎవరు పట్టుకుంటారు!—భగవంతుడే పట్టవలె!

జూడాసు వెళ్ళిపోగానే మిగిలిన వాళ్ళతో జీసస్ ఇట్లన్నాడు: "మిత్రులారా, నేనిక చాలాకాలం మీతోనుండుట కవకాశముండదు. నా సందేశాన్ని గూర్చి మీరిక శుష్కంగా తర్కవితర్కాలూ, విమర్శలూ చేయవద్దు. నేను పరసీయులకు చెప్పినట్లే, మీరున్నూ నా జీవితాన్ని అనుసరించి బ్రతకండి! మీ కిప్పుడు నేను చెప్పవలసిన క్రొత్తవిషయమే మున్నది! ఈక్షణంవరకూ మిమ్ముల్ని అందరినీ నే నెట్లా ప్రేమించానో, అట్లాగే మీరు కూడ చివరవరకు, మీలో నొకరినొకరు మాత్రమే కాకుండ మానవకోటినంతను మీ పవిత్రప్రేమతో ముంచివేయవలె! నా సందేశసారాంశమంతా ఈ వొక్కనియమంలోనే ఇమిడివున్నది. దీనిని మీప్రాణంతో నెరవేర్చడంచేతనే మీరు నా నిజమైన అనుచరులును, బంధువులును కాగలరు. మీలో పవిత్రమైన పరస్పరసఖ్యత, సర్వమానవశ్రేణియెడల నిష్కల్మష, నిష్కామప్రేమ—ఈ రెండే మీజీవితసార్థకతకూ, లోక కల్యాణానికి ముఖ్యసాధనాలు."

## 43

జీసను మరికొన్ని విషయాలనుగురించి తనశిష్యులకు చెప్పినాడు. "పరమేశ్వరుని పరిపూర్ణతనే నిరంతరం మ

ససంచేస్తూ, అంతకంతకు దానిని సమీపించేటందుకు చేసే ప్రియత్నంలోనే జీవితపరమార్థమున్నది. ఇదొక్కటే రాజమార్గం! ఈమార్గాన్నే నే ననుసరించి బ్రతికినాను అది మీకును తెలుసును."

అప్పుడు 'థామస్' అనుఒకశిష్యుడన్నాడు: "స్వామీ, మీరెక్కడికి పోతున్నారో మాకు తెలియడంలేదు. కనుక ఆమార్గమేదో మాకుబోధపడదు." జీసను జవాబు చెప్పినాడు; "నేను పోయేది పరమపితను చేరడానికి. నేను మీకిచ్చిన సందేశమే మిమ్ముకూడ ఎప్పటికైనా ఆయన వద్దకు చేర్చేమార్గం. ఈమార్గంద్వారా తప్ప ఎవ్వరూ జీవితేశ్వరుని కలియలేరు. నాప్రేమసాధననే అనుసరించండి, ఈశ్వరదర్శనమౌతుంది!"

'ఫిలిప్' (మరొకశిష్యుడు) అడిగినాడు : "తండ్రిని మాకు మీరే చూపవలె!"

జీసను సమాధానం చెప్పినాడు: "పరమపితను మీకెట్లా చూపవలెనేమి! నేనాయనలోనే వున్నాను; ఆతండ్రి నాలోనూ వున్నాడు. ఈరహస్యాన్ని తెలుసుకున్నవాడే, 'తండ్రి' యెవరో తెలుసుకోగలడు.—నే నిప్పుడు చనిపోనున్నాను. ప్రాపంచికమూఢవ్యక్తు లెవరూ నన్నింక చూడలేరు. కాని నాకు మృత్యువులేదు. పది అమృతమౌ దానినే మీరును అనుసరించి నడవండి! జగజ్జనకుని

కెందుకు? నేను పోయేది పరమేశ్వరునివద్దకే. ఆయనవద్ద నుంచి నాఆత్మ స్వస్వరూపం పొంది, తిరిగివచ్చి మీ హృదయాలలో ప్రవేశిస్తుంది. నాచావుకొరకు మీరు విచారింపబనిలేదు——నిజానికి ఆనందించవలె! ఎందువల్ల నంటే అప్పుడు నాశరీరానికి బదులుగా నాఆత్మయే మీ హృదయాలలో నివాసముంటుంది. అదే మీకును ఆత్మ తారక మౌతుంది."

---

## 44

"పవిత్రమైన, కృత్రిమరహితమైన మీకోరికలన్నీ నెరవేర్చడమే పరమేశ్వరుని వుద్దేశం. నాప్రేమసూత్రాన్నే మీరు మార్గదర్శిగా చేసుకొని నెరవేర్చితే మీకోరికలన్నీ సిద్ధించి బంధవిముక్తు లౌతారు. భగవంతుడు నాకెట్లా మంచినే ప్రసాదించాడో, ఆమంచినే మీకును నేను పంచి యియ్యవలె ననుకొన్నాను. భగవంతుని ఆజ్ఞను నేను నెరవేర్చినట్లే, నాప్రేమసూత్రాన్ని బట్టి మీరుకూడా నడుచు కుంటే ధన్యులౌతారు. నేనుమిమ్మల నెట్లు ప్రేమిస్తున్నానో మీగును అట్లాగే అన్యోన్యప్రేమచే బంధింపబడవలె! అనగా ప్రేమకొరకై మీప్రాణాలనైన యిచ్చివేయుటకు సంసిద్ధులు కావలె. నేనుచెప్పినట్లు చేయగలిగితే మీరు నాకు సమానులే. నేను నేర్పిన బ్రహ్మవిద్యయే మీకు

"నేను మీకు చెప్పవలసిన దింకా చాలా వున్నది. కాని యిప్పుడు దానిని మీరర్థంచేసుకొనడం చాల కష్ట సాధ్యం. సత్యమెప్పుడు మీలో రాజ్యంచేస్తుందో అప్పుడే మీకు సమస్తం విశదమౌతుంది. మూలసూత్రి మొక్కటే. కొత్తగా తెచ్చి మీకిప్పుడు చెప్పవలసిం దేమీ లేదు. భగవానుని పవిత్రవాణిని, గంభీరవాణిని వినగలగడంలోనే వున్నది సమస్తమూ. దానివల్లనే జీవితము యొక్క అన్నివ్యాపారాలలోను, జరిగే సమస్తసంఘటనలలోను తిన్ననిమార్గం కనిపిస్తుంది. నేనుచెప్పినమాటలనే మీలోని ఆత్మకూడా మీకు చెపుతుంది."

---

## 45

తరువాత జీసస్ తనదృష్టిని ఊర్ధ్వముఖంగా తిప్పి భగవత్ప్రార్థన చేశాడు: "తండ్రీ! పవిత్రమైన స్వేచ్ఛతో కూడిన జీవితాన్ని ఈ నీబిడ్డకిచ్చావు. తద్వారా నీబిడ్డడు యథార్థజీవితాన్ని సాధించి పొందడమే నీయిచ్ఛ. సత్య స్వరూపాన్ని తెలుసుకొనడమే నిజమైనబ్రతుకు బ్రతకడం. నిన్ను ప్రజలకందరకూ చూప ప్రయత్నించాను. నీ వే పనికై నన్ను నియమించావో ఆపనినే నెరవేర్చినాను. ఈమనుష్యులందరూ నీవాళ్ళు—నీబిడ్డలే! నీయాజ్ఞ కావడం చేతనే, నీవు ప్రతిజీవిలోనూ వున్నావని నే నీలోకానికి

చెప్పివస్తున్నాను. తెలుసుకున్నవాళ్ళివరో తెలుసుకున్నా
రు. నాలోపలనున్న శక్తే తమందరిలోనూ వున్నదని
తెలుసుకున్నారు. ఈశక్తి అంతా నీనుంచివచ్చేదేయని
కూడ తెలుసుకున్నారు. ఈప్రపంచ మిక నాది కాదు
కదా! నేను నీవద్దకేవస్తున్నాను. వీరందరిని నిరంతరం సత్య
జ్యోతియొక్క వెలుగులో పెంచి, రక్షింతువని నాప్రార్థన!
అసత్యజీవనాన్నుండి తప్పించి వీరికందరికి ధర్మబలమిచ్చి
ధీరులనుజేసి నీసత్యమార్గంలో నడిపించు, నాయనా! అం
దరూ కలిసి ఒక్కటయ్యేటట్లునూ; నీవు నాలోనూ, నేను
నీలోనూ వున్నట్లే అందరూకలిసి నీలోనుండునట్లునూ
అనుగ్రహింపవోయి! మనుష్యులు నీయిచ్ఛ ననుసరించి
తా మీ ప్రపంచంలో పుట్టలేదనిన్నీ, నీపవిత్రప్రేమా
విశేషంచేత, నేనిక్కడికి పంపబడ్డట్టే తామూకూడ పంప
బడ్డారనిన్నీ వారు తెలుసుకునే శక్తినిమ్ము. నేను నిన్ను
దర్శించినట్లు వీరునిన్ను దర్శింపలేదు. కొంతవరకే నిన్ను
హింపగలిగినారు. వారికి జీవితమిచ్చినది నీ అవ్యాజప్రేమే
యని గుర్తెరిగి, నీనుండి పొందిన ప్రేమనే తిరిగి వారు నీకు
కానుకగా అర్పించవలసియున్నారు కదా! ఈసత్యవచనాన్నే
యిక్కడ నీబిడ్డలకందరకూ చెప్పివస్తున్నాను, తండ్రీ! *

అక్కడనుంచి లేచి జీసస్ శిష్యులతో కలసి తిరిగి ఆలివ్ పర్వతానికి వెళ్ళినాడు. వెళ్ళేదారిలో తనశిష్యులతో యిట్లన్నాడు: "ఇదిగో, సమయంవచ్చింది! గొర్రెల కాపరి ఏమరివున్నప్పుడు గొర్రెలన్నీ యెట్లా చెదిరిపోతాయో అట్లాగే మీరును చెల్లాచెదరై పోనున్నారు! నేను పట్టుబడుట నిశ్చయం. నాకు మృత్యువాసన్నమైనవెంటనే మీరు నన్ను విడిచిపోతారు." అప్పుడు పీటరన్నాడు; "అయ్యా, ఎంతమాట! నేనా పారిపోయేది! ఆమాట మీరనవద్దు. అందరూ ద్రోహులైపోయినా, నన్నుగూర్చి మాత్రం మీరనట్లనవద్దండీ! నేను మిమ్మెన్నడూ విడువను. విడిచి యెట్లా బ్రతకవలె? మీతో నేనెక్కడికైనా సరే రావడానికి సంసిద్ధుణ్ణి—జైలుకు, చివరకు చావుకే గానియ్యండి, మీ ఆజ్ఞకెప్పుడూ బద్ధుడను!" "ముందేదో చేస్తానని యిప్పుడే బడాయికొట్టకోయి, నాయనా! ఏమీలే, యిప్పుడేమిచెప్పగలవు! ఈరాత్రి కోడి కూయక మునుపే, ఒక్కసారిగాదు, మూడుసార్లు నీవునన్ను తిరస్కరిస్తావు—నన్ను నీగర్భశత్రువుగా విసిరేస్తావు సుమా!"

అట్లా యెన్నటికీ జరుగబోదని శపథాలు చేశాడు పీటరు. మిగిలిన శిష్యులు గూడ యీలాగే జీససుయెడల తమకుగల భక్తివిశ్వాసాలను ప్రకటించారు

కొంతసేపిట్లా నడిచిపోయి గెత్సెమేన్ తోటకు వచ్చారు.

"కొంతసేపు మీరిక్కడ ఆగండి! నేనిక్కడ ప్రార్థన చేసుకోవలె." అని జీసను శిష్యులతో చెప్పి పేతురునూ, 'జెబెడీ' యొక్క యిద్దరు కుమారులనూ తనవెంట బెట్టుకొని కొంచెం దూరం పోయి "నా కేదో దుఃఖం వస్తున్నది—మీరిక్కడనే వుండండ"ని చెపుతూ తానొక్కడూ మరికొంత దూరం పోయి నేలమీద కూర్చొని భగవత్ప్రార్థన చేశాడు: "ఓ తండ్రీ! నా తండ్రీ! నాకాగకు కనిపెట్టుకొని వున్న ఈ యవస్థనుండి నన్ను తప్పించవా?" అని ఒక్క క్షణమాగుకొని "సాధ్యమైతే నా కేమి గాక్కా, నాయనా! ఇందులో నా యిష్ట మేమున్నది? నా యిచ్ఛ కాదు—కానే కాదు! నీ యిష్ట మేదో అదే నెరవేరు గాక! నేను కోరుకున్నట్లు జరుగనీయకు తండ్రీ! నీ యిష్టానుసారం సమస్తమూ శాసించు!"

అప్పుడక్కడనుంచి లేచి శిష్యులున్న చోటికి వెళ్ళి చూచాడు. వాళ్ళందరూ అప్పటికి కన్నంటే నిద్రపోయినారు. చేతితో తట్టి, అందరినీ లేపి చెప్పినాడు: "మీరు ఆత్మబలం సంపాదించి ధైర్యంతో నుండండి! సిద్ధమైన బల మెప్పుడూ ఆత్మదే! శరీరం దుర్బలమ"ని చెప్పి తిరిగి దూరం పోయి ప్రార్థనలో నిమగ్నుడైనాడు. "తండ్రీ, నీయి

ష్టమే! నాకు కోరికే లేదు! నీవే—సమస్తానికీ నీవే!!" అని తిరిగి శిష్యులవద్దకు వచ్చినాడు. ఇంతట్లోనే మరల వాళ్లం దరూ నిద్రకు బడ్డారు. జీసను మూడవసారి దూరంగా పోయి "స్వామీ, నా యత్నమేమీ లేదు. లేదయ్యా— లేదు! తిరుగులేని నీ పవిత్రసంకల్పమే నెరవేర్చు! నా కింత కు మించిన మహాప్రసాద మేమున్నది?" అని ప్రార్థించి తిరిగి శిష్యులవద్దకు వచ్చి "రండి, నాయనలారా! లేచిరం డి! ఈ ప్రాపంచికపు దుష్టత్వానికీ, స్వార్థపరులకూ నాకు నేనేపట్టుబడి, స్వాధీనుడ నౌతున్నాను—రండి, రండి"ని హెచ్చరించాడు.

---

## 47

జీస నీమాట లంటూ వుండగానే, జూడాస్ ఇస్కా రియటు, ఎక్కడనుంచి వచ్చాడో, వచ్చి జీసను కెదురుగా నిలబడ్డాడు. తా నొక్కడే కాదు—తనవెంట యుద్ధభటు లనూ, మతబోధకుల సేవకులను కొందరినీ, కర్రలతో, కత్తులతో, చేతిలాంతర్లతో వెంట బెట్టుకొని వచ్చాడు వచ్చినవెంటనే జూడాసు జీససుకు దగ్గరగా పోయి నమస్క రించి ముద్దెట్టుకున్నాడు.

"ఏమోయి, నాయనా! నీవు వచ్చినపని యేమిట" న్నాడు జీసను.

వెంటనే భటులు జీసస్‌ను ముట్టడించారు. పట్టుకొని కట్టివేదా మని చూస్తున్నారు. ఈలోగా పీటరు, జీసస్‌వక్కనున్న ఒకభటుని చేతిలోనున్న కత్తి నూడబెరికి వానినే ఒకదెబ్బ వేశాడు. దెబ్బ తప్పిపోయి, భటునిచెవి తెగి కిందబడ్డది. ఇదిచూచి జీసస్‌కు పట్టరాని బాధకలిగి పీటరుమీద రుద్రస్వరూపం దాల్చాడు. "ఛీ, ఛీ!—ఆకత్తి వెంటనే వరలో పెడతావా లేదా? కత్తి చేతబూనిన ప్రతివాడూ తిరిగి తప్పకుండ కత్తి చేతనే హతు డౌతా డని యెరుగవు కాబోలు!" అని పీటరుయొక్క అమానుషత్వాన్ని తీవ్రంగా ఖండించాడు.

తరువాత, జీసస్ తన్ను పట్టుకొనుటకు వచ్చిన వారివైపు తిరిగి యిట్లన్నాడు: "అయ్యా, దొంగను పట్టడానికి వచ్చినట్లు కత్తులూ గద్దలూ తెచ్చా రెందుకు? నేనెప్పుడూ—ప్రతిదినమూ—గుడిలో మీతో బహిరంగంగా కలిసి వుంటూ హితబోధ చేసేవాడను గదా! అయితే నన్నప్పుడే యెందుకు పట్టుకున్నారు కారు? పైగా, మీకు నే నేమి అపకారం చేశాను? నామీద మీ కేమి ద్వేషమున్నది?"

అక్కడకు వచ్చిన [illegible]అధికారి వొకడు వెంటనే జీసస్‌ను పట్టుకొని కట్టివేయ మని భటులకు ఆజ్ఞయిచ్చాడు. భటులు వచ్చి సంకెళ్ళు తగిలించారు. జీసస్‌ను

దట కైఫాస్‌వద్దకు తీసుకొని వెళ్ళినారు. జీససును చంపి జాతిధర్మాలను రక్షించవలెనని పరసీయులకు బోధించిన కైఫాసే యితడు! జీససును కైఫాసుయొక్క గుమ్మంలోకి తీసుకొని వచ్చారు. అప్పటికే జీసను శిష్యులందరూ పారి పోయినారు. వీట రొక్కడు మాత్రమే, జీససును ఎక్క డికి తీసుకొని పోతారో చూదా మనే వేడుకతో దూరం గా, వెనుక వెనుకనే దాగుతూ, వెంట వచ్చాడు.

జీససుతో వచ్చిన జనసమూహంతో, వీటరు కూడ, భయపడుతూ, యెట్లాగో కైఫాను వాకిట్లో ప్రవేశించాడు. వాకిట్లో కూర్చున్న ఒక స్త్రీ వీటరును చూచి "గలిలీదే శపు జీససుతో వుండే వాడవేనా అయ్యో నీవు కూడా!" అని అడిగింది. ఆ ఒక్కమాటతో వీటరుగుండె చెదిరిపో యింది. జీససుతో కలిపి తనను కూడ పట్టుకుంటారని అప రిమితభయం పుట్టింది. "అదేమిటి! ఏమో, యేమో! నీవు మాట్లా డేది నా కేమీ అర్థం కావడం లేదు!" అని యె ట్లాగో కొంతధైర్యం తెచ్చుకొని బుకాయించేశాడు.

జీససును కైఫాస్‌యింట్లోకి తీసుకొని వెళ్ళినారు. లోపలికి పోయే గుంపులో దూరి వీటరుకూడా పోయినా డు. లోపల ఒక నెగడు మండుతున్నది. మరొక స్త్రీ చలి చేత మంటవద్ద ఒళ్ళు కాచుకుంటూ కూర్చున్నది. వీటరు కూడా వచ్చి ఆనెగడువద్దనే నిలుచున్నాడు. ఆస్త్రీ వీటరు

# 48

మతపెద్దలూ, శాస్త్రిపండితులూ—అందరూ కైఫాస్ యింటివద్ద చేరినారు. అందరూ చేరగానే, జీససును లోనికి తీసుకొని వచ్చి కైఫాస్ యెదుట నిలబెట్టినారు. అప్పుడు కైఫాస్ "నీవు ప్రజలకేమి బోధించావు? నీ శిష్యులెవరు?" అని అధికారాంధతతో జీససు నడిగినాడు.

దానికి జీసస జవాబిచ్చాడు: "నేనేమి బోధించినా, ఎప్పుడూ బహిరంగంగా, అందరయెదుటనే చెప్పినాను. చాటున యేదీ, యెప్పుడూ చెప్పలేదు. మీరు నన్నే అడగట మెందుకు? నాసందేశాన్ని విన్నవాళ్లూ, తెలుసుకున్న వాళ్ళూ వున్నారు కదా! అడిగితే వాళ్లే చెపుతారు"

జీస సిట్లా చెప్పగానే కైఫాసు నౌకర్లలో వొకడు ముందుకు వచ్చి "ఏమయ్యా, ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసునా తెలియదా నీకు? ప్రభువుగారికి జవాబు చెప్పడ మట్లాగేనా!" అంటూ జీససు ముఖంమీద ఒక్క దెబ్బ కొట్టి తోసేశాడు.

జీససు దెబ్బ కోర్చుకొని నెమ్మదిగా జవాబు చెప్పినాడు: "నేను చెప్పిన మాటలలో చెడుగుంటే నా తప్పెక్కడనో చూపరాదా? లేక, నా జవాబు సరిగానే వుంటే నన్నిట్లా హింస పెట్టడ మెందుకు నాయనా?"

జీససుమీద యేమి నేరం మోపుదామని కైఫా

సూ, యింకామిగిలిన పెద్దలూ కలిసి తిరిగి ఆలోచన చేశారు. నిందారోపణకు తగినకారణ మేదీ దొరక లేదు. చివర కిద్దరు దొంగసాక్షులను పట్టుకొచ్చారు. «జెరుసలేము' గుడిని నాశనంచేసి, తిరిగి మూడుదినాలలో తన ఈశ్వరాలయం మీదో సృష్టిస్తానని జీసను అందరియెదుటా అన్నాడని చెప్పి ఈయిద్దరూ సాక్ష్యమిచ్చారు. అప్పుడు కైఫాసు జీససు నడిగినాడు: "వీళ్ళిచ్చిన సాక్ష్యానికి నీవేమి జవాబు చెప్తావు?"—జీసను జవాబు చెప్ప లేదు. "అయితే, నీ వేనా అవతారపురుషుడవైన క్రీస్తువు? నీవు భగవంతుని కుమారుడవట గాదూ?—అవునా?" అప్పుడు నిర్భయంగా జీసను జవాబు చెప్పినాడు: "ఔను, నేను భగవంతుని బిడ్డనే!"

కైఫాసుకు పట్టరాని కోపం వచ్చింది. ఆవేశంతో అతని శరీరమంతా వణకి పోయింది. "ద్రోహం, ద్రోహం! ఇదంతా స్వామిద్రోహం!! ఇంతకంటె రుజువు మన కేమి కావలె?—అయ్యా, చూచారు కదా మీరందరూ— ఈ మనిషిసాహసం! ఈ పదరుబోతు మాటలన్నీ మీ చెవులతో మీరే విన్నారు. ఇందులో యెంత దైవదూషణ వున్నదో మీకే తెలుసును. దీనికై ఇప్పు డితని మీద మీ రేమిశిక్ష విధిస్తారో చెప్పండ"ని బిగ్గరగా అరవడం మొదలుపెట్టినాడు.

"మరణదండన! మరణదండనే!!" అని అందరూ ఒక్కసారి యింకా బిగ్గరగా అరచారు.

ఈ మాట వినబడగానే అక్కడనున్న భటులూ, ఇతరమనుష్యులూ జీసను మీదిమీదికి పోయి ముఖము నిండా ఉమ్మివేసి చెంపలమీద గొట్టి, అతనికళ్ళు మూసి, మళ్ళీ కొట్టి "నీవు దేవునికుమారుడవట కాదా? నరే! అయితే, ని నిప్పుడెవరు కొట్టినారో చెప్పుకో!" మని అతిక్రూరంగా ఎగతాళి చేశారు. కాని జీసను పెదవైనా కదల్పకుండా నిశ్శబ్దంగా నిలబడ్డాడు.

## 49

అక్కడనుండి జీససును సంకెళ్లతోనే, రోమనుగవర్నరైన 'పాంటియస్‌పైలేటు' యింటికి తీసుకొని పోయినారు. పైలేటు గుమ్మంబయటకు వచ్చి "ఇతడు చేసిన నేరమేమిటి?" అని అడిగినాడు. "వీడా! పరమదుర్మార్గుడు! కనుకనే మీవద్దకు తీసుకొని వచ్చామ"న్నారు.

పైలేటు:—అతడు చెడ్డవాడని మీరనుకుంటే, మీ చట్టాల ప్రకారం అతనిని మీరే విచారణ చేయరాదా?

భటులు:—వీనికి మరణదండన విధించబడ్డది. దానిని అమలు జరిపించడానికే మీవద్దకు తీసుకొని వచ్చాము. ప్రాణం తీయడానికి మా కధికారం లేదు.

పైలేటు:—అసలితడు చేసిననేర మేమిటి?

భటులు:—ఇతడు ప్రజలను సందడిసి లేపి, రాజద్రోహానికి పురికొల్పుతున్నాడు. సీజరుమహారాజుకిచ్చేపన్ను లెగబెట్టమని ప్రజలలో ప్రబోధం చేస్తున్నాడు. పైగా యూదులజాతి కంతకూ తానే రాజునంటున్నాడు!

పైలేటు యీ వృత్తాంతమంతా విని, జీససును తరువాత తన కోర్టువద్దకు తీసుకొని రమ్మని చెప్పి యింట్లోనికి పోయినాడు.

జీససును వెంటనే కోర్టుకు తీసుకొని పోయినారు. కొంతసేపటికి పైలేటు కచేరీకి వచ్చాడు—గద్దెమీదికెక్కి కూర్చున్నాడు. జీససును తెచ్చి గవర్నరుయెదుట నిలబెట్టినారు.

పైలేటు:—నీవే యూదులకు రాజునంటూ వస్తే— నిజమేనా?

జీసస్:—అయ్యా, ఈప్రశ్న మీ యంతట మీరు యోచించి నన్నడుగుతున్నారా? లేక ఇతరు లెవరో అన్నమాటనే తిరిగి అంటున్నారా?

పైలేటు:—నేను యూదుడను కాను. నీవే రాజువన్నావని చెప్పి, మీ స్వజాతీయులే నిన్ను నాయెదుటికి తీసుకొని వచ్చారు.

జీసస్:—ఔను! నేను కూడ ఒకరాజునే! కాని ఇది ఐహిక రాజ్యం కాదు. నేనుకూడ ఒకదేశం సంపాదించి రాజును గావలెనని కోరుకుంటే, నా అనుచరులందరూ నాపక్షం పూని శత్రువులతో యుద్ధం చేసే వారు కాని 'వీనిని చంపవలసింది'ని ఈవిధంగా నన్ను యూదుల చేతులలో పడవేసి వుండరు. కాని వాళ్ళిప్పుడు నన్నే యవస్థపాలు చేశారో మీరే చూస్తున్నారు. ఇక నా రాజరిక మెక్కడ? నా రాజ్య మీభూలోక రాజ్యంకాదు.

పైలేటు—నీవు రాజువని ఇప్పటికి కూడా అనుకుంటున్నావా?

జీసస్—ఈశ్వర రాజ్యాన్ని గూర్చి యథార్థ మేదో ప్రజలకు బోధించడమే నాపని. సత్యాన్నే నమ్మకొని బ్రతికే ప్రతివాడూ ఒకరాజే!

పైలేటు—"సత్యమా!"--సత్యమంటే.. ఏమిటి?--

ఈప్రశ్న పైలేటు జీసస్‌ను అడగ లేదు. ఈమాట తనలో తనకే ఒక తీవ్రమైన ఆత్మజిజ్ఞాసగా పరిణమించింది.

తక్షణమే పైలేటు అక్కడనుండి లేచి బయటనున్న యూదులగుంపువద్దకు పోయి "ఇతను తప్పువని చేశాడని నేనేమాత్రమును నమ్మలేను. మరణదండన విధించవలసినంత నేరమేమీ కనిపించదు." అని యూదులతో అన్నాడు.

కాని అక్కడ కూడిన మతబోధకు లందరూ ఒక్క

పెట్టున ఘోష పెట్టడం ప్రారంభించారు "వీడు దుష్టుడు! ప్రజలందరిలోనూ రాజద్రోహం పురికొల్పుతున్నాడు! ఇలాగా యిట్లాగే పసిదిక్కెట్టి ఉపకరించే ప్రజల సంగతి రాజు మీదికి లేవదీయగలడు—సందేహం లేదు!"

తిరిగి మాట్లాడకుండా ఎదుట మొదట పైలేటు జీససును ప్రశ్నించాడు: "నీ గురించి వీరు మోపిన నేరమేదో విన్నావు కదా! నిన్ను నీ వెందుకు సమర్థించుకోవు? తగిన సమాధానం చెప్పి ఈ అపవాదు బాపుకోరాదా!"

ఆ ప్రశ్నకు జీసను జవాబే చెప్పలేదు—ఒక్క మాటైనా చెప్పలేదు. పైలేటుకు ఆశ్చర్యం తోచింది.

ఈ స్థితిలో జీసను నేమి చేయవలెనో, అతని విషయమై యేమి చెప్పవలెనో పైలేటు కేమీ తోచలేదు. తిరిగి మరొక ప్రశ్న వేశాడు: "ఇతడసలు గలిలీనుంచి కాదా తీసుకొని వచ్చారు?" "ఔన"ని అందరూ జవాబు చెప్పినారు. "అయితే యితడు హేరోద్దుప్రభువుయొక్క అధీనంలో నున్నాడ"ని చెప్పి పైలేటు జీససును హేరోద్దువద్దకు పంపివేశాడు. యూదుల కోరికమీద నిర్దోషియైన జీససును దండించడం పైలేటు కిష్టం లేదు. అతనిని హేరోద్దువద్దకు బంపి, తనకు బాధ తప్పించె కదా అని కొంతవరకు గుండె చల్లబరుచుకున్నాడు.

# 50

జీససును హెరడ్డువద్దకు తీసుకొని వెళ్ళినారు. హెరడ్డు అతనినిగూర్చి ఆవరకే చాలా విన్నాడు. జీససును తన యెదుటకు తీసుకొని రమ్మని ఆజ్ఞాపించి, అతని సేవేవో చాలా ప్రశ్న లడిగి బాధించడం మొదలుపెట్టినాడు. కాని జీసను ఒక్క ప్రశ్నకైనా జవాబు చెప్ప లేదు. భక్తుడై, జ్ఞానియై, మానియై విశ్వపతియొక్క ధర్మబలంతో, ప్రచండమైన ప్రాపంచికాధికారము నంతనూ ధిక్కరింపగల మానంతో భీష్మించి నిలబడ్డాడు. మతగురువులూ, శాస్త్ర పండితులూ పై లేటు యెదుట జీసనుమీాద మోపిన నిందలన్నీ తిరిగి హెరడ్డుయెదుట గూడ మోపబడి విచారణకు వచ్చినవి. జీసను రాజద్రోహి యనిన్నీ, విప్లవకారు డనిన్నీ యూదు లందరూ కూడి పెద్ద, తెంపులేని ఘోష పెట్టినారు. కాని హెరడ్డు జీససును చూచి, వట్టి డంబాచారి యని అనుకున్నాడు. అట్టి వాడివల్ల దేశాని కేమీా హాని కలుగనేర దని తీర్పు జెప్పినాడు. ఇతడొక వెర్రివా డని అందరికీ కనిపింప జేయడానికి, జీససుకు ఒక ఎర్రని పెద్ద వదులుచొక్కా తొడిగించి, ఆ పిచ్చివైఖరికోసే తిరిగి పై లేటు వద్దకే పంపివేశాడు.

తిరిగి రెండవసారి జీససును పై లేటువద్దకు తీసుకొనవచ్చారు. పై లేటు యూదుల సంఘపెద్దల సందరిసి

డదా మని పైలేటు సంకల్పించాడు. కాని మతస్వాము లూ, బోధకులూ కలిసి ప్రజలనుకూడ జీససుమీాదికి పురి కొల్పినారు. ఇద్దరిలో యెవరిని క్షమించడ మని పైలేట డిగినప్పుడు, బోధకులూ ప్రజలూ కలిసి ఒక్కసారిగా "బరబాసునే! బరబాసునే క్షమించవలె"నని అల్లరిగా కేక లుపెట్టినారు.

అయితే జీససు నేమి చేయవలె"నని పైలే టడిగి నాడు.

"రోమనుల శిక్షాపద్ధతిలో శిలువమీాద వేసి చంప వలె''నని తిరిగి అందరూ గొల్లున అమితమైన కొలాహలం చేశారు.

జీససుకు మరణశిక్ష వేయడానికి పైలేటు కేమీా ఇష్టంలేదు. ఆమాట వినడానికే అతనిహృదయం కొట్టుకు న్నది. అతనిని విడుదలచేసి పంపివేయమని మతబోధకు లను ఎన్నోవిధాల ప్రోత్సహించి హితబోధ చేశాడు. "ఏ మయ్యా, పాప మతనిమీాద మీాకెందు కింతకసి? నేరమే మీా కనిపించదే! అతనిప్రాణం తీయవలసిన అగత్యమేమీా లేదు—న్యాయ మసలే లేదు!" అని చెప్పినాడు.

కాని మతబోధకులూ వారి భటులూ కలిసి "కాదు, కాదు! చంపవలె—శిలువపై బెట్టి చంపితీరవలె! చంపక తప్పదు!" అని ఆవేశనిగా కేకలు పెట్టినారు.

పై లేటుకు చివరకువినుగుపుట్టింది: "అయితే మీరే తీసుకొనిపోయి, ఏమి చేస్తారో మీచేతులతోనే చేయండి! ఇతనిలో తప్పేమీ నాకు కనిపించడం లేద"న్నాను.

అప్పుడు మతగురువు లన్నారు: "చట్టప్రకారం న్యాయం జరిగితీరవలె నని మిమ్మల్ని మే మందరమూ కోరు తున్నాము. 'దేవుని కుమారుడ'నని చాటుకుంటున్న ఈ వంచకుని చంపవలిసిం దని న్యాయచట్టమే చెపుతున్నది."

పై లేటకు 'దేవుని కుమారుడం'టే యేమో తెలియక, కొంత తొట్రుపాటు పడ్డాడు. జీససును తిరిగి కోర్టు లోనికి పిలిచి యిట్లడిగినాడు: "నీ వెవరవు? మీవూ రేది?"

జీసను మాట్లాడ లేదు.—

"జవాబు చెప్ప వేమి? నా కిక్కడ సర్వాధికార మున్న దని నీ వెరుగవేమో! నిన్ను శిలువమీద బెట్టించుటకు గాని, లేక నాయిష్టమైతే క్షమించి రక్షించడానికి గాని నా కధికార మున్నది సుమా!" అని కొంచెం కఠినంగా చెప్పి చూచాడు గవర్నరు.

అప్పుడు నిర్భయంగా జీసను జవాబు చెప్పినాడు: "మీకు నామీద అధికార మేమాత్రమూ లేదు—లేదు! అధికారమంతా భగవంతునినుండి మాత్రమే రావలె!! అతడే సర్వాధికారి—జగన్నియంత! మన మేపాటి వాళ్లము?"

ఎట్లాగైనా జీససును విడుదల చేద్దామనే కోరిక పైలేటుకు అంతకంత కధిక మౌతున్నది. తిరిగి ప్రజలవద్దకు పోయి "మీ రాజును మీరే చంపడమా! ఇది యెక్కడి ధర్మం?" అని అడిగినాడు.

యూదులకు కోపం వచ్చింది. "ఎవడు తానే రాజనని గర్వంతో తిరుగుతాడో వాడు సీజరు చక్రవర్తికి ప్రమాదకరమైన శత్రువు—దేశద్రోహి. కనుక మీరు వీనిని క్షమించి వదలి పెట్టుదురా, మీరు కూడ సీజరు యెడల విశ్వాసఘాతకులౌతారు; మహారాజుయెడల అవిధేయులై సంచరించిన వారౌతారు. మా మహారాజు సీజరున్నాడు: ఈ దొంగలరాజును మాత్రం విడువకూడదు. వీనిని చంపవలె!" అని బిగ్గరగా రొద చేశారు.

ఈమాటలు విని పైలేటు చాల బాధ జెందినాడు. ఇక జీససుకు చావు తప్ప దనుకున్నాడు. మరొకసారి యూదుల నందరినీ సంబోధించి "ఈ నిరపరాధిని, ఈయమాయకుని ప్రాణం తీయించిన పాపం నా కంటకుండును గాక!" అని అంతర్ముఖుడై భగవంతుని ప్రార్థిస్తూ, హత్యాపాపపరిహారసూచనగా నీళ్లతో తనచేతులు కడిగేసుకున్నాడు.

"ఆ పాపమంతా మామీదనూ, మాబిడ్డలమీద

నూ పడినా సరే పడనీయండి—ఏమైననూ, వీనిని చంపి తీరవలె!" నన్నారు ప్రజ లందరూ.

అప్పుడు, ముందుగా జీసనును దెబ్బలు కొట్ట మని పైలేటు ఆజ్ఞ యిచ్చాడు. భటులు ముందు కువచ్చి జీసనును పట్టుకొని, దెబ్బలు కొట్టి ముళ్లతోకీ నొక దానినిచేసి 'ఇదిగో రాజుగారికి కిరీటమ'నిచెప్పి దానిని అత నితలపై బెట్టి చేతి కొక కర్ర నిచ్చారు. పెద్ద ఎర్రగుడ్డ నొకదానిని అతనిపై గప్పి నిలబెట్టి యెగతాళి ప్రారంభిం చారు. అందరూ చేరి కృత్రిమహృదయాలతో వంగివంగి అతనికి నమస్కరించారు. "అయ్యా! చక్రవర్తిగారూ! మీకు దిగ్విజయ మగుగాక! మహారాజా! ఓహో! మా యానంద మేమనవచ్చు!" అని యంటూ, తిరిగి అప్పుడే అతనిని చెంపలమీదనూ తలమీదనూ దెబ్బమీద దెబ్బ కొట్టి హింస పెడుతూ, ముఖంనిండా ఉమ్ములు వేయడం ప్రారంభించారు. మా రాజు సీజరుమహాప్రభువు! కాని వీనిని—ఈద్రోహిని—చంపండి, చంపండ"ని గొంతులు చించుకొని కేకలుపెట్టినారు.

[illegible] పైలేటు [illegible] అశక్తతను తాను సందిం చుకుంటూ జీసనును శిలువపై బెట్టమని ఆజ్ఞ యిచ్చాడు. పైనగప్పిన ఎర్రగుడ్డను దీసి జీసను స్వంతబట్టలనే తిరిగి అ తనికి కట్టబెట్టినారు. బరువైన కొయ్యశిలువ నొకదానిని

జీసను భుజంమీద బెట్టి మోయించుకొని 'గోల్గోథా' అను చోటికి తీసుకొని పోయినారు. తరువాత అతనిని శిలువపై బెట్టి, చేతులమీదనూ పాదాలమీదనూ మేకులుదింపినారు. మరిద్దరు దొంగలను జీసనుకు చెరియొకవైపునా బెట్టి, ఇదేవిధంగా వాళ్లకు గూడ శిలువశిక్ష వేసినారు.

అప్పుడు జీసనిట్లన్నాడు: "పరమేశ్వరా! నాతండ్రీ! వీరిప్పుడేమి చేస్తున్నారో వీరికే తెలియదు, ఏమి చేసినా, నీకృపకు, పాత్రులేకదా! వీరి నందరినీ క్షమించి, రక్షించు నాయనా!!"

---

## 52

జీసను ప్రాణావశిష్టుడుగా శిలువమీద వ్రేలాడుతుండగా ప్రజలందరూ ఆయనచుట్టూ మూగి నిలబడి, దుర్భాషలాడడం మొదలుపెట్టినారు. కొందరు బాగా దగ్గరకువచ్చి, తలలు పంకించి "ఇదిగో, యిప్పుడుచూడు! జెరుసలేముగుడి బద్దలుకొట్టి తిరిగి మూడు దినాలలో కడతానన్నావే! మంచిది—గుడిసంగతి తరువాత చూదాములే! పోనీ, చేతనైతే నిన్ను నీవు రక్షించుకోరాదూ? శిలువ దిగి కిందికిరా, చూతాము!" అని గేలిచేశారు.

మతాధికారులూ, యింకా వాళ్ళతోవచ్చిన ఇతర పెద్దలుకూడ జీసనును చూచి ఎగతాళిగా నవ్వుతూ

"వీడు చాలమంది జీవితాలను బాగుచేసి రక్షించినాడట! కాని యిప్పుడు తన్ను తాను రక్షించుకోలేకపోతున్నాడేమో!—నీవు క్రీస్తువని మాకు నమ్మకం పుట్టించు! నీవా శిలువమీదినుంచి క్రిందికి దిగి రాగలిగితే, అట్లాగే తప్పక నిన్ను మేము నమ్ముతాము. అదే మాకు నిదర్శనం. కానీ దేవునికుమారుడననిన్నీ, తనను దేవు డెన్నటికీ విడిచి పెట్టడనిన్నీ డంబాలు కొట్టేవాడు! అట్లైతే దేవుడిప్పుడు వీని నెందుకు వదిలిపెట్టినాడో!" అంటూ కేలిగా మాట్లాడినారు.

ప్రజలూ, మతగురువులూ, భటులూ—అందరూ వదరుబోతులై నోటికివచ్చినట్లు తిట్టనారంభించారు.

జీసను కిరువక్కలా శిలువమీదనున్న దొంగలలో ఒక డన్నాడు: "ఏమయ్యా, నీవు నిజంగా క్రీస్తువేఅయితే నిన్ను నీవు రక్షించుకొని, మా ప్రాణాలుకూడ కాపాడ రాదా?" ఈమాటలు విని రెండవప్రక్కనున్న దొంగ "ఛీ, ఛీ! దుర్మార్గుడా! నోరు మూసుకో! నీకు భగవంతుని భయమైనా లేదు. నీవుచేసిన లెక్కలేని దుండగాలకై ఈ శిలువపై యిట్లా చస్తున్నావు! ఇంకా బుద్ధిలేక ఆ అమాయకుని, ఆ నిరపరాధిని తిడుతున్నావురా! మన యిద్దరి గతి యిట్లా అయేటందుకు కావలసినంత కారణమూ, న్యాయమూకూడ వున్నది. ఇతడో—యేపాపం యెరుగని పుణ్యాత్ముడు. అహాహా! ఆదేమి శాంతం, నాయనా!!"

తొమ్మిదిగంటలవేళ జీసను బిగ్గరగా 'ఎలీ! ఎలీ!' అని పిలిచాడు. అనగా 'ఓ పరమేశ్వరా! నా పరమేశ్వరా!' అని యర్థం.

ప్రజలు 'ఎలీ' అనే మాట విని "ఓహో, 'ఎలియాస్' ప్రవక్తను కాబోలు పిలుస్తున్నాడు! చూదాము—ఎలియాస్ వచ్చి యేమాత్రం రక్షిస్తాడో!" అని నవ్వులాటగా మాట్లాడినారు.

తరువాత, "దాహం వేస్తున్నది—తాగడానికి కొంచెం నీళ్లిస్తారా?" అని నెమ్మదిగా అడిగినాడు జీసస్. అప్పుడొకడు సముద్రపు పాచిముక్క (స్పాంజి) నొక దానిని పుల్లని రసంలో ముంచి ఒకపుల్లతో జీససునోటి కందిచ్చాడు. రసం కొంచెం పెదవులతో చప్పరించి జీసను బిగ్గరగా "సరి—పూర్తి అయింది! తండ్రీ, ఇదిగో నా సర్వస్వం నీచేతిలోనే వుంచుతున్నాను! నాయనా, అంతకూ నీవే గతివి!" అంటూ తల వేలవేసి ప్రాణం విడిచాడు.

శ్రీ సుజనరంజని ముద్రాక్షరశాల, రాజమండ్రి.

